శ్రీః

# విష్ణులహరి

పండితరాజ జగన్నాథ విరచితము

అమృతధారావ్యాఖ్య

**గరిమెళ్ళ సోమయాజులు శర్మ**


ముద్రణ : జయనామ సంవత్సర దీపావళి *23-10-2014*

ప్రతులు : *300*

పేజీలు : *48*

వెల రూ. : అమూల్యం





**RAVI MOHAN RAO,** M.Sc., M.A.,
Dandy House,
Flat No : 404, Janjanam Complex,
Opp. I Town Police Station,
CHIRALA-523 155, Prakasam Dist.
Cell : 9440115411



***D.T.P. by :-***
L.Durga Prasad,
**Sanjay Graphics,**
CHIRALA.
Cell : 9966156263

***Printed at -***
**Karshak Art Printers,**
**HYDERABAD**

ఓమ్
శ్రీరామచన్ద్రాయ నమః

# విష్ణులహరి

## పండితరాజ జగన్నాథ విరచితము

శ్లో॥ విషీదతా నాథ! విషానలోపమే
విషాదభూమౌ భవసాగరే విభో! ।
పరమ్ ప్రతీకారమపశ్యతాధునా
మయాయమాత్మా భవతే నివేదితః ॥ 1

## అమృతధారావ్యాఖ్య

*కం॥ శ్రీమత్పుష్పగిరీశ*
*స్వామిపదాబ్జములు గొలిచి - పండితరాజ*
*శ్రీమత్కరుణాలహరికి*
*శ్రీమదమృతధార యనఁగఁ - జేసెద వ్యాఖ్యన్.*

**అవతారిక :-** శ్రీ జగన్నాథ పండిత రాయలు తన యాత్మను భగవంతునకు నివేదించుచు నీ కరుణాలహరి యను శ్రీ విష్ణుస్తోత్రము నారంభించుచున్నాఁడు.

**ప్రతిపదార్థము:-** నాథ! = సమస్త జగములకు భర్త వైన శ్రీకృష్ణా!, విభో = ప్రభూ!, విష + అనల + ఉపమే = విషాగ్నితుల్య మైన, విషాదభూమౌ = దుఃఖములకు స్థాన మైన, భవసాగరే = సంసార సముద్రము నందు, విషీదతా = విషాదము నొందుచున్న, పరమ్ = వేఱొక, ప్రతీకారమ్ = ప్రతిక్రియను, అపశ్యతా = కానని, మయా = నాచేత, అధునా = ఇప్పుడు, అయమ్ = ఈ, ఆత్మా = నా యాత్మ, భవతే = నీకొఱకు, నివేదితః = నివేదింపఁబడినది.

**తాత్పర్యము :-** శ్రీకృష్ణా! జగన్నాథా! విభూ! విషమయము, నగ్నితుల్యము, దుఃఖస్థానము నగు నీసంసారసముద్రములో మునిఁగి దీనిని నిరోధించు మఱియొక ప్రతిక్రియను గానక యిప్పుడు నా యాత్మను నీకు నివేదించుచున్నాను.

***విశేషము:***

*శ్లో॥ శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణమ్ పాదసేవనమ్।*
*అర్చనం వన్దనం దాస్యం సఖ్యమాత్మనివేదనమ్॥ (భాగ-7స్క-5-23శ్లో)*

(1) శ్రీ విష్ణుమూర్తి కథలు వినుట (2) శ్రీ విష్ణునామములను గీర్తించుట (3) శ్రీవిష్ణుమూర్తిని స్మరించుట (4) శ్రీవిష్ణు పాదములను సేవించుట (5) శ్రీవిష్ణు పాదముల నర్చించుట (6) శ్రీవిష్ణుమూర్తికి నమస్కరించుట (7) శ్రీవిష్ణువునకు దాస్యము చేయుట (8) శ్రీవిష్ణునితో సఖ్యము (మైత్రి) చేయుట (9) శ్రీవిష్ణున కాత్మను నివేదించుట నవవిధ భక్తులని శ్రీమద్భాగవత పురాణములోఁ జెప్పఁబడినది. ఈ శ్లోకమును శ్రీమదాంధ్ర మహా భాగవతములో భక్తశిఖామణి యగు పోతన మహాకవి యిట్లు తెనిఁగించినాఁడు–

*మ॥ తనుహృద్భాషల సఖ్యమున్ శ్రవణమున్ దాసత్వమున్ వందనా*
*ర్చనముల్ సేవయు నాత్మలో నెఱుకయున్ సంకీర్తనల్ చింతనం*
*బను నీ తొమ్మిది భక్తిమార్గముల సర్వాత్మున్ హరిన్ నమ్మి స*
*జ్జనుఁడై యుండుట భద్ర మంచుఁ దలఁతున్ సత్యంబు దైత్యోత్తమా!*
*(ఆంధ్రభాగ- 7 స్క- 167)*

*శ్లో॥ శ్రీవిష్ణోః శ్రవణే పరీక్షిదభవద్, వైయాసకిః కీర్తనే*
*ప్రహ్లాదః స్మరణే, తదంఘ్రిభజనే లక్ష్మీః, పృథుః పూజనే।*
*అక్రూరస్త్వభివన్దనే, కపిపతి ర్దాస్యే, -థ సఖ్యే-ర్జునః*
*సర్వస్వాత్మనివేదనే బలిరభూత్ కృష్ణాప్తిరేషామ్ పరా॥ (భ.ర.సిం.-1-265)*

(1) శ్రీవిష్ణు కథా శ్రవణము వలనఁ బరీక్షిన్మహారాజు (2) కీర్తనము వలన శ్రీ శుకమహర్షి (3) స్మరణము వలనఁ బ్రహ్లాదుఁడు (4) పాదసేవనము వలన శ్రీమహాలక్ష్మి (5) అర్చనము వలనఁ బృథుచక్రవర్తి (6) వందనము వలన నక్రూరుఁడు (7) దాస్యము వలన హనుమంతుఁడు (8) సఖ్యము వలన నర్జునుఁడు (9) ఆత్మనివేదనము వలన బలిచక్రవర్తి శ్రీకృష్ణ సాయుజ్యము నొంది రని యీ శ్లోకమును భక్తిరసామృతసింధువులో శ్రీరూపగోస్వామి యుదహరించినాఁడు. ఈ శ్లోకమునకు శ్రీవేంకటేశ్వరశతకములో నా యనువాదము

*సీ॥ మును నీ చరిత్రంబు -విని పరీక్షిద్భూపుఁ*
*డర్థిఁ గీర్తించి వై-యాసకియును*
*భవ్యసంస్మరణచేఁ -బ్రహ్లాద భక్తుండు*
*పదపద్మభజనచే- భార్గవియును*

*బృథుపూజనముచేతఁ -బృథురాజు నక్రూరుఁ*
*డభివందనము చేత -హనుమ నిత్య*
*దాస్యంబు చేతను- దవిలి సఖ్యము చేత*
*శక్రతనూజుండు- శశ్వదాత్మ*

*తే॥గీ॥ సంనివేదనచే బలి-చక్రవర్తి*
*తుల్యకైవల్య మొందిరి - తొల్లిఁ గాన*
*నవవిధంబుల నినుఁ జేరు - నరుఁడు గొలిచి*
*వేంకటాచలవాస! శ్రీ-వేంకటేశ!*

ఈ నవవిధభక్తులలో నాత్మనివేదనభక్తిని జగన్నాథ మహాకవి యీ కరుణాలహరీ స్తోత్రములోఁ బ్రతిపాదించినాఁడు.

ఈ స్తోత్రములో మొదటి శ్లోకమునుండి 12వ శ్లోకము వఱకు వంశస్థవృత్తములు. **'జతౌ తు వంశస్థ ముదీరితం జరౌ'** అని వృత్తరత్నాకరలక్షణము. వంశస్థములోఁ బ్రతిపాదము నందు 'జ-త-జ-ర' యను గణము లుండును.

*శ్లో॥ మో భూమి స్త్రిగురుః శ్రియం దిశతి; యో వృద్ధిం జలం చాదిలో*
*రోఽగ్ని ర్మధ్యలఘు ర్వినాశ; మనిలో దేశాటనం సోఽంత్యగః ।*
*తో వ్యోమాంతలఘు ర్ధనాపహరణం, జోఽర్కో రుజమ్ మధ్యగో*
*భ శ్చంద్రో యశ ఉజ్జ్వలమ్ ముఖగురు; ర్నో నాక ఆయు స్త్రిలః ॥*

అని ఛందశ్శాస్త్రములో జగణమున కధిదేవత సూర్యుఁ డనియు; ఫలితము రోగ మనియుఁ జెప్పఁబడుటచేఁ గావ్యాదిని జగణమును బ్రయోగించుట శుభప్రదము కాదని శంకింపఁగూడదు.

'అత ఏవ కిరాత - మాఘ - నైషధీయేషు దుష్టఫలాదప్యుదాసీనాజ్జగణా దుదాసీనస్య తగణస్య సత్త్వా న్న మందం నాశుభమితి దోషాభావః'

కిరాతార్జునీయ - శిశుపాలవధ- నైషధీయ చరితాదులలో మొదట 'జగణము' ప్రయోగింపఁబడినది. దుష్టఫలము నిచ్చుటలో నుదాసీన మగు జగణమునకుఁ బ్రక్కన నుదాసీన మగు తగణ ముండుటచే మందఫలము గాని యశుభము గాని లేనందున దోషము లే దని వృత్తరత్నాకరటీకలో నారాయణభట్టును-

"మఱియు - ఆరోగ్యమ్ భాస్కరా దుపైతి' యను మనువచనంబు గలుగుటం జేసి

తే॥గీ॥ *అరయ నారోగ్యకరుఁ డైన యరుణుఁ డేలు*
*జగణమున నెట్లు రోగంబు సంభవించుఁ*
*గాంతి యగుఁ గాని రోగంబు గాదు రుక్ప*
*దార్థ మనుచు వెల్లంకి తాతప్ప చెప్పె*

వ॥ కావున శిశుపాల వధంబునందు 'శ్రియః పతిః శ్రీమతి' యని వణిజ్మాఘుండును, కిరాతార్జునీయంబునందు 'శ్రియః కురూణా' మని భారవియును మణిదర్పణము నందు 'దివాకరం నమస్కృత్య' యనియును, శాకుననామ గ్రంథంబునందు 'విరించి నారాయణ శంకరేభ్య' యనియును, ఛప్పన్నంబునందుఁ 'బ్రణమ్యలోకకర్తార' మనియును, భోజరాజీయంబు నందు 'సునీతిశాస్త్రసద్విద్యా' యనియును ముందరం బొందించిరి" (అప్ప-4-72, 73) అని యప్పకవియుఁ జెప్పుటచేఁ గావ్యాదిని జగణము ప్రయోగించుట దోషము గాదు.

'మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతాని శాస్త్రాణి ప్రథంతే' అని మహాభాష్యములో శ్రీ పతంజలి భగవానులు శాస్త్రకావ్యాదులు మంగళాదిగా నుండ వలెనని యనుశాసించిరి గదా! ఇక్కడ 'విషీదతా' యని విషాదశబ్దముతో మొదలు పెట్టుట యమంగళము గదా! యని భావింపఁగూడదు.

**ఈశ్వర కృష్ణముని సాంఖ్యకారికను -**

శ్లో॥ *దుఃఖత్రయాభిఘాతా జ్జిజ్ఞాసా తదపఘాతకే హేతౌ ।*
*దృష్టే సాஉపార్థా చేన్నైకాంతాత్యంతతోஉ భావాత్ ॥*

అని దుఃఖశబ్దముతో మొదలు పెట్టినాఁడు. ఇక్కడ శ్రీవాచస్పతమిశ్రులు తత్త్వకౌముదిలో- 'యద్యపి దుఃఖ మమంగళం తథాపి తత్పరిహారార్థత్వేన తదపఘాతో మంగళ మేవేతి యుక్తం శాస్త్రాదౌ తత్కీర్తన మితి' - దుఃఖ మమంగళ మైనను తత్పరిహారార్థముగా దుఃఖాపఘాతము మంగళమే యని సమన్వయము చేసినారు. ఈశ్వరకృష్ణమునికి దుఃఖాపఘాతము నందే తాత్పర్యము గాని దుఃఖము వివక్షితము గానట్లే యిచట జగన్నాథ కవికిఁ గూడ విషాదభంజన పూర్వకముగా నాత్మనివేదనమందే తాత్పర్యము గావున దోషము లేదని సరిపెట్టు కొనవలెను.

శ్లో॥ *ఆశీర్నమస్క్రియా వస్తునిర్దేశో వాపి తన్ముఖమ్* (కావ్య-1-14)

కావ్యము (1) ఆశీర్వాదముతోఁ గాని (2) నమస్కారముతో ఁగాని (3) వస్తునిర్దేశముతోఁ గాని మొదలు పెట్ట వలయు నని కావ్యాదర్శములో దండ్యాచార్యు లుపదేశించినారు గదా! ఇక్కడ నాశీరాదులు లేవు గదా! యని శంకింపఁగూడదు. ఇక్కడ

నాశీర్వాదనమస్కారములు లేక పోయినను నాత్మనివేదనరూప మగు వస్తునిర్దేశము గల దని గ్రహింపవలయును. వాస్తవమునకు 'మంగళానాం చ మంగళమ్' మంగళముల కన్నింటికిఁ బరమమంగళస్వరూపుఁ డైన శ్రీమహావిష్ణువు నాథ - విభు శబ్దములచే నిక్కడ నిర్దేశింపఁ బడుటచే సర్వము మంగళము.

**శ్లో॥ భవానలజ్వాలవిలుప్తచేతనః**
**శరణ్య! తేఽంఘ్రిం శరణమ్ భయాదయామ్ ।**
**విభావ్య భూయోఽపి దయాసుధాంబుధే!**
**విధేహి మే నాథ! యథా యథేచ్ఛసి ॥ 2**

**ప్రతిపదార్థము :-** శరణ్య! = ఆశ్రయింపఁ దగిన వాఁడా! భక్తరక్షానిపుణా!; భవ = సంసార మనెడి; అనల = అగ్ని యొక్క; జ్వాల = మంటలచే; విలుప్త = విశేషముగా లోపించిన; పూర్తిగాఁ గాలిన; చేతనః = చైతన్యము గల నేను; భయాత్ = భయముతో; తే = నీ యొక్క; అంఘ్రిమ్ = చరణమును; శరణమ్ = శరణు; అయామ్ = పొందితిని; దయా = దయకు; సుధా+అంబుధే = అమృత సముద్రము వంటి వాఁడా!; నాథ = స్వామీ!; యథా యథా ఇచ్ఛసి = నీ వెట్లెట్లు కోరుదువో యట్లు; మే = నాకు; విధేహి = కావింపుము.

**తాత్పర్యము :-** భక్తశరణ్యా! శ్రీకృష్ణా! ఈ సంసార మనెడి యగ్గి మంటలచే నా చైతన్యము పూర్తిగా లోపించినది. భయముతో నీ పాదములు శరణు పొందితిని. కరుణామృత సాగరా! ఈ విషయమును బాగుగా నాలోచించి ప్రభూ! నీకేదేది యుచితముగాఁ దోఁచునో దానిని నాకుఁ గల్గఁజేయుము. ధారణపోషణాదులచే నీవే నన్నుఁ గాపాడుమని భావము. 2

**శ్లో॥ విహాయ సంసారమహామరుస్థలీ-**
**మలీకదేహాదిమిలన్మరీచికామ్ ।**
**కృపాతరంగాకులమన్మనోమృగో**
**విగాఢుమీశ! త్వయి గాఢమీహతే ॥ 3**

**ప్రతిపదార్థము :** కృపా = దయకు; తరంగ = నీటి కెరటము వంటి వాఁడా! శ్రీకృష్ణా! సంసార = సంసారమనెడి; మహా = గొప్ప; మరుస్థలీమ్ = నీళ్ళు లేని చవుటి నేలను; అలీక = అసత్యమైన; దేహాది = శరీరము మొదలగు వానితో; మిలత్ = కూడుచున్న; మరీచికామ్ = ఎండమావులను; విహాయ = విడిచి పెట్టి; మత్ = నా యొక్క; మనః = మనస్సనెడి; మృగః = లేఁడి; ఆకుల = వ్యాకులపాటు చెందినదై; త్వయి = నీ యందు; గాఢమ్ = ఎక్కువగా; విగాఢుమ్ = మునుఁగుటకు; ఈశ! = ఈశ్వరా! ఈహతే = కోరు కొనుచున్నది.

**తాత్పర్యము :** ఈశ్వరా! శ్రీకృష్ణా! అసత్యము లైన శరీరము, ఇంద్రియములు మొదలగు వానితోఁ గూడిన యీ విషయము లన్నియు నెండమావుల వంటివి. ఈ సంసారము పెద్ద యూషరక్షేత్రము. నీవు దయకు జలతరంగము వంటివాఁడవు. నా మనస్సు లేఁడి వంటిది. ఇట్టి నా మనోమృగము వీని నన్నింటిని విడిచి పెట్టి నీ కృపాతరంగములో నోలలాడుట కువ్విళ్ళూరుచున్నది.

**విశేషము :** ఇక్కడఁ గృపా + తరంగ + ఆకుల = దయయను కెరటములచే నాకులమైన సముద్రము వంటివాఁడా! యని యీశ్వరునకు సంబుద్ధిగాఁ గూడ నన్వయింపవచ్చును.

ఈ శ్లోకములో సంసారమునందు మహామరుస్థలీత్వము, దేహాదులయందు మరీచికాత్వము, కృప యందుఁ దరంగత్వము, మనస్సు నందు మృగత్వము నారోపింపఁ బడుటచే రూపకాలంకారము.

ఈ శ్లోకము రసగంగాధరములోఁ బరికరాలంకారప్రకరణములో నుదాహరింపఁ బడినది.

"అయం చ వాచ్యసిద్ధ్యంగవ్యంగ్యగర్భత్వేన; ఉపస్కారక వ్యంగ్య గర్భత్వేన; ద్విధా భవన్ – వ్యంగ్యస్య వాచ్యాయ మానత్వ – తద్విపర్యయాభ్యాం చతుర్ధా। ఆద్యో యథా – 'విహాయ సంసార... ...' అత్ర గాహన సిద్ధ్యంగ కృపేత్యాదేః సముద్రరూపం వ్యంగ్య వాచ్యాయమానమ్"

ఈ పరికరాలంకారము (1) వాచ్యసిద్ధ్యంగ వ్యంగ్య గర్భము (2) ఉపస్కారక వ్యంగ్యగర్భము నని రెండు విధములై మఱల నా వ్యంగ్యము (1) వాచ్యాయమానత్వము (2) తద్విపర్యయము నని రెండు విధములై మొత్తము నాలుగు విధములగు చున్నది. వీనిలో మొదటిదగు వాచ్యసిద్ధ్యంగ వ్యంగ్య గర్భము వాచ్యాయమానముగా నుండుటకు 'విహాయ సంసార... ...' అను శ్లోక ముదాహరణము. ఇక్కడఁ గృప మొదలగు దానిచేఁ గల్గు సముద్రరూపమగు వ్యంగ్యము గాహనసిద్ధ్యంగము కావున వాచ్యాయమానము. ఇక్కడ సముద్రరూప మగు వ్యంగ్యము లేకుండ గాహన (మునుఁగుట యను) రూపమగు వాచ్యమునకు సిద్ధి లేదు. అందువలన నీ పరికరము వాచ్యసిద్ధ్యంగ వ్యంగ్య గర్భమైనది. సముద్రరూపముగా నున్న వ్యంగ్యము కేవలము కావ్యభావనా పరిపక్వబుద్ధులగు పండితులకే కాదు, సామాన్య పాఠకులకుఁ గూడఁ దెలియుటకు శక్యమైన దగుటచే నిది వాచ్యాయమాన మైనదని భావము.

ఈ శ్లోకమునందు మూఁడవ పాఠములో నున్న –

*'కృపా! తరంగాకుల! మన్మనోమృగః'*

అనునది యుస్మానియా విశ్వవిద్యాలయ ప్రతిపాఠము. రసగంగాధరములోఁ గూడ నీపాఠమే గలదు. నిర్ణయసాగరము వారి కావ్యమాలాప్రతిలో దీనికి బదులుగా

*'మనోమృగో మే కరుణామృతాంబుధే!'*

అను పాఠము గలదు. అప్పుడు – కరుణా = దయకు; అమృత + అంబుధే! = అమృత సముద్రము వంటి వాఁడా! శ్రీకృష్ణా!; మే = నా యొక్క; మనోమృగః = మనస్సనెడి లేఁడి' యని యర్థము చెప్పుకొనవలయును. 3

**శ్లో॥ త్వదంఘ్రిఫుల్లాంబుజమధ్యనిర్గల–**
**న్మరన్ద నిఃస్యన్దనితాన్తలమ్పటః ।**
**మనోమిలిన్దో మమ ముక్తచాపల–**
**స్త్వదన్యమీశాన! తృణాయ మన్యతే ॥ 4**

**ప్రతిపదార్థము :** ఈశాన = ఈశ్వరా!; త్వత్ = నీయొక్క; అంఘ్రి = పాదము లనెడు; ఫుల్ల = వికసించిన; అంబుజ = పద్మముల యొక్క; మధ్య = నడిమి భాగము నుండి; నిర్గలత్ = బయటకు జాఱుచున్న; మరంద = తేనె యొక్క; నిస్స్యంద = స్రవణము నందు; నితాంత = మిక్కిలి; లంపటః = ఆసక్తి గల; మమ = నా యొక్క; మనః = మనస్సనెడు; మిళిందః = తుమ్మెద; ముక్త = విడిచి పెట్టిన; చాపలః = చాపల్యము గలదై, చపలత్వము లేనిదై; త్వత్ = నీ కంటె; అన్యమ్ = వేఱైన దానిని; తృణాయ = గడ్డి పఱకగా; మన్యతే = తలఁచుచున్నది.

**తాత్పర్యము :** ఈశ్వరా! శ్రీకృష్ణా! నీ పాదములను వికసితకమలముల మధ్యభాగము నుండి బయటకు జాలువాఱుచున్న మకరంద ప్రవాహమునం దెక్కువ యాసక్తి గల నా మనస్సను తుమ్మెద చాపల్యమును వీడి నీ కంటె భిన్నమైన దానిని గడ్డిపోఁచగాఁ దలఁచుచున్నది. 4

**శ్లో॥ జగత్త్రయత్రాణవిధౌ ధృతవ్రతం**
**తవాంఘ్రిరాజీవమపాస్య యే జనాః ।**
**శరణ్యమన్యన్మృగయన్తి యాన్తి తే**
**నితాన్తమీశాన! కృతాన్తదేహళీమ్ ॥ 5**

**ప్రతిపదార్థము :** ఈశాన = ఈశ్వరా! కృష్ణా!; జగత్త్రయ = ముల్లోకములను; త్రాణవిధౌ = రక్షించు విధానము నందు; ధృతవ్రతమ్ = ధరించిన వ్రతము గలదానిని (నియమమును బూనినదానిని); తవ = నీ యొక్క; అంఘ్రిరాజీవమ్ = పాదమను పద్మమును; అపాస్య = విడిచిపెట్టి; యే జనాః = ఏ జనులు; అన్యత్ = మఱియొక; శరణ్యమ్ = రక్షణమును;

మృగయంతి = వెదకుచున్నారో; తే = వారు; కృతాంత = యముని యొక్క; దేహళీమ్ = గృహద్వారము యొక్క గడపను; నితాంతమ్ = ఎక్కువగా; యాంతి = ప్రవేశించుచున్నారు.

**తాత్పర్యము :** ఓ శ్రీకృష్ణా! ఏ జనులు ముజ్జగములను రక్షించు వ్రతమును బూనిన నీ పాదపద్మమును విడిచిపెట్టి మఱియొక దానిని శరణు పొందుచున్నారో వారు యమగృహ ద్వారమున కధికముగా వెళ్ళుచున్నారు. నీ పాదములను భజించువారు మోక్షము పొందుదురనియుఁ దక్కిన వాని నాశ్రయించు వారు యమలోకమును బొందుదురనియు భావము. 5

**శ్లో॥ రమాముఖామ్భోజవికాసనక్షమో**
**జగత్త్రయోద్బోధవిధానదీక్షితః ।**
**కదా మదజ్ఞానవిభావరీం హరే!**
**హరిష్యతి త్వన్నయనారుణోదయః ॥ 6**

**ప్రతిపదార్థము :** హరే! = ఓ కృష్ణా!; రమా = శ్రీలక్ష్మీదేవి యొక్క; ముఖ = మొగమను; అంభోజ = పద్మమును; వికాసన = వికసింపఁజేయుటలో; క్షమః = సమర్థనమైనదియు; జగత్ త్రయ = మూఁడు లోకములను; ఉద్బోధ = మేలుకొలుపుట యను; విధాన = విధి యందు; దీక్షితః = దీక్ష పొందినదియునగు; త్వత్ = నీ యొక్క; నయన = కన్నులనెడి; అరుణ = అరుణుని యొక్క; ఉదయః = పొడుపు (ఎఱ్ఱని కాంతి యొక్క యుదయము); మత్ = నా యొక్క; అజ్ఞాన = అజ్ఞాన మనెడి; విభావరీమ్ = చీఁకటిని; కదా= ఎప్పుడు; హరిష్యతి = హరించునో గదా!

**తాత్పర్యము :** ఓ శ్రీకృష్ణా! శ్రీలక్ష్మీదేవి యొక్క ముఖపద్మమును వికసింపఁజేయుటకుఁ జాలినది (సమర్థమైనది); ముజ్జగములను మేలుకొలుపుట యను విధానములో దీక్షను బొందినది యగు నీ నేత్రారుణోదయము (నీ కన్నుల యందుఁ బుట్టిన యెఱ్ఱని కాంతి) నా యజ్ఞానాంధకారము నెప్పుడు పటాపంచలు చేయునో కదా!

**విశేషము :** ఇక్కడ రమాముఖమునం దంభోజత్వము; అజ్ఞానమునందు విభావరీత్వము; నయనమునం దరుణత్వము నారోపింపఁ బడుటచే రూపకాలంకారము. అరుణ శబ్దమునందు శ్లేషము. 6

**శ్లో॥ సురాసురస్వాన్తచకోరచుమ్బితా**
**సమస్తసన్తాపచయాపనోదినీ ।**
**మహానిశీథే మమ మానసే కదా**
**స్ఫురిష్యతి త్వన్ముఖచన్ద్రచన్ద్రికా ॥ 7**

**ప్రతిపదార్థము :** శ్రీకృష్ణా! సుర = దేవతల యొక్క; అసుర = రాక్షసుల యొక్క; స్వాంత = మనస్సు లనెడు; చకోర = చకోర పక్షులచేత (వెన్నెల పులఁగులచేత); చుంబితా = ముద్దు పెట్టుకొనఁబడినది; సమస్త = సకల; సంతాప = దుఃఖముల యొక్క; చయ = సమూహమును; అపనోదినీ = పోఁగొట్టు నదియు నగు; త్వత్ = నీ యొక్క; ముఖ = ముఖమనెడు; చంద్ర = చంద్రుని యొక్క; చంద్రికా = వెన్నెల; మమ = నా యొక్క; మానసే = మనస్సు నందలి; మహానిశీథే = గాఢాంధకారము (చీఁకటి గుయ్యారము) తోఁ గూడిన రాత్రి యందు; కదా = ఎప్పుడు; స్ఫురిష్యతి = తోఁచును = ప్రకాశించును?.

**తాత్పర్యము :** ఓ శ్రీకృష్ణా! సురాసురుల మనస్సులనెడి వెన్నెల పులుఁగులచేఁ జుంబింపఁ బడినది; సకల సంతాప సమూహములను బాఱఁద్రోలునది యగు నీ మోముచందురు నుండి కాయు వెన్నెల నా యొక్క యజ్ఞానాంధకారముతోఁ గూడిన మనస్సను రాత్రి యందెప్పుడు స్ఫురించునో కదా!

**విశేషము :** శ్రీ కృష్ణుఁడు దేవతాశత్రువు లైన రాక్షసులను సంహరించు వాఁడు. దైత్యారి. అయినను బ్రహ్లాద విభీషణాది భక్తులను గాపాడినవాఁడు. కావున నిక్కడ నసురశబ్దముచేఁ బ్రహ్లాదాదులను గ్రహింపవలెను. చకోరపక్షులు చంద్రకిరణములను ద్రాగి జీవించును. కాఁబట్టి వీనికి వెన్నెల పులుఁగు లని తెలుఁగు పేరు. సంతాపములు వేఁడివి. వెన్నెల చల్లనిది. శ్రీ కృష్ణుని ముఖమనెడి చంద్రు నుండి వెలువడు వెన్నెల నా మనస్సను గాఢరాత్రిలో వచ్చి దుఃఖము లనెడి వేఁడినిఁ బోఁగొట్టి చల్లఁదనమును గూర్పవలె నని భావము. 7

**శ్లో॥ సుయౌవనాపాణ్డురగణ్డమణ్డల–**
**ప్రతిస్ఫురత్కుణ్డలతాణ్డవాద్భుతమ్ ।**
**గదాగ్రజ! త్వన్ముఖఫుల్లపఙ్కజం**
**కదా మదక్ష్ణోరతిథీభవిష్యతి ॥ 8**

**ప్రతిపదార్థము :** గద + అగ్రజ = గదుఁడను యాదవున కన్నవైన శ్రీకృష్ణా!; సుయౌవన = మంచి జవ్వనముచే; ఆపాండుర = మిక్కిలి తెల్లనైన; గండ = చెక్కిళ్ళ యొక్క; మండల = గుండ్రని భాగములందు; ప్రతిస్ఫురత్ = ప్రతిబింబించి ప్రకాశించుచున్న; కుండల = చెవుల యందున్న మకరకుండలముల యొక్క; తాండవ = తాండవముచే; అద్భుతమ్ = ఆశ్చర్యకర మైన; త్వత్ = నీ యొక్క; ముఖ = ముఖమనెడు; ఫుల్ల = వికసించిన; పంకజమ్ = పద్మము; కదా = ఎప్పుడు; మమ = నా యొక్క; అక్ష్ణోః = కన్నులకు; అతిథీభవిష్యతి = అతిథియగునో!

**తాత్పర్యము :** శ్రీకృష్ణా! ఎక్కువ జవ్వనముతో మిక్కిలి పసిమి తెలుపు మిసిమితోఁ గూడిన నీ గుండ్రని బుగ్గల యందుఁ బ్రతిఫలించు మకరకుండలముల తాండవముచే నాశ్చర్యమును గొల్పునది యగు నీ మోమను వికసించిన పద్మము నా కన్నుల కతిథియై యెప్పుడు కన్పట్టునో! నీ ముఖసాక్షాత్కారము నా కెప్పుడు గల్గునో కదా! యని భావము.

**విశేషము :** 'గదాగ్రజో ముంజకేశో దాశార్హో దశరూపభృత్' అని యమరకోశము నందలి యధికపాఠము.

*శ్లో॥ పౌరవీ రోహిణీ భద్రా మదిరా రోచనా ఇలా।*
*దేవకీ ప్రముఖా ఆసన్ పత్న్య ఆనక దుందుభేః ॥*

*శ్లో॥ బలం గదం సారణం చ దుర్మదం విపులం ధ్రువమ్ ।*
*వసుదేవస్తు రోహిణ్యాం కృతాదీ నుదపాదయత్ ॥*

*శ్లో॥ వసుదేవస్తు దేవక్యామష్టపుత్రా నజీజనత్ ।*
*అష్టమస్తు తయోరాసీత్ స్వయమేవ హరిః కిల ॥*

*(భాగ - 9స్క - 24 అధ్యా - 45 ... 55 శ్లో)*

అని శ్రీమద్భాగవత పురాణము

వసుదేవునకు (1) పౌరవి (2) రోహిణి (3) భద్ర (4) మదిర (5) రోచన (6) ఇల (7) దేవకి మొదలగు భార్యలు గలరు. వీరిలో రోహిణి యందు (1) బలరాముఁడు (2) గదుఁడు (3) సారణుఁడు (4) దుర్మదుఁడు (5) విపులుఁడు (6) ధ్రువుఁడు (7) కృతుఁడు మొదలగు పుత్త్రులు జన్మించిరి. దేవకి యందు శ్రీకృష్ణపరమాత్మ జనించెను. శ్రీకృష్ణుఁడు వయసులో గదుని కంటెఁ బెద్దవాఁడగుటచే గదాగ్రజుఁడైనాఁడు.

**అతిథీభవిష్యతి :** 'అతిథి + భవిష్యతి' యని యుండఁగా 'భవిష్యతి' యనునది భూధాతురూప మగుటచే – 'కృభ్వస్తియోగే సంపద్యకర్తరి చ్విః' (5–4–50) అను సూత్రముచే 'చ్వి' ప్రత్యయము 'అభూత తద్భావ ఇతి వ్యక్తవ్యమ్' అను వార్తికముచే నభూత తద్భావార్థము (ఇంతకు ముందు గానిది, యిపుడు తద్భావమును బొందినది) లో వచ్చినది. 'చ్వౌ చ' (7–4–26) అను సూత్రముచే చ్వి ప్రత్యయము పరమైనపుడు 'అతిథి' శబ్దము నందలి చివరి వర్ణమునకు దీర్ఘము వచ్చి 'అతిథీభవిష్యతి' యను రూపము వచ్చినది.

ఇంతకు ముందు నా కన్నుల కతిథి గాని శ్రీకృష్ణుని ముఖపద్మమిఁక ముందెప్పు డతిథియగునో కదా! యని భావము.

పాండురగండమండల; 'కుండలతాండవ' యనుచోట వృత్త్యనుప్రాసము.

శ్లో॥ సురాపగాతుఙ్గతరఙ్గచాలితాం
సురాసురానీకలలాట లాలితామ్ ।
కదా దధే దేవ! దయామృతోదధే!
భవత్పదామ్భోరుహధూళిధోరణీమ్ ॥ 9

**ప్రతిపదార్థము :** దయా = కరుణయను; అమృత = పీయూషమునకు; ఉదధే = సముద్రము వంటి వాఁడా! దేవ = దేవా! శ్రీకృష్ణా!; సుర + ఆపగా = దేవనది యైన గంగ యొక్క; తుంగ = ఎత్తైన; తరంగ = కెరటములచే; చాలితామ్ = ఊఁపఁబడినది; సుర = దేవతల యొక్క; అసుర = రాక్షసుల యొక్క; అనీక = సమూహము యొక్క; లలాట = ఫాలభాగములచే; లాలితమ్ = లాలింపఁబడినదియు నగు; భవత్ = నీ యొక్క; పద = అడుగు లనెడు; అంభోరుహ = పద్మముల యొక్క; ధూళి = దుమ్ము (పుప్పొడి) యొక్క; ధోరణీమ్ = పంక్తిని; కదా = ఎప్పుడు; దధే = ధరింతునో కదా!

**తాత్పర్యము :** కరుణామృత సముద్రా! దేవా! శ్రీకృష్ణా! గంగానది యొక్క యెత్తైన తరఁగలచేఁ గదలింపఁబడినది (గంగానది విష్ణుపాదముల నుండి పుట్టినది గావున నెప్పుడును బాదధూళినిఁ గడుగుచుండును), సురాసురులు గుంపులుగా వచ్చి తమ ఫాలము లందు ధరించుటచే లాలింపఁబడినది యగు నీ పదపద్మధూళి యొక్క పంక్తి నెప్పుడు ధరింతునో కదా! 9

శ్లో॥ మహాజవాశ్ఛిన్నవివేకరశ్మయో
మదోద్ధతా దేవ! మదక్షవాజినః ।
హరే! సమాసాద్య తవాంఘ్రిమన్దురా-
మపాస్తవేగా దధతాం సుశీలతామ్ ॥ 10

**ప్రతిపదార్థము :** దేవ = దేవా!; హరే = శ్రీకృష్ణా! మహాజవాః = మిక్కిలి వడి గలవి; ఛిన్న = తెగిన; వివేక = వివేచన మనెడి; రశ్మయః = పగ్గములు గలవి; మద = మదము (మత్తు) చే; ఉద్ధతాః = గర్వించినవి యగు; మత్ = నా యొక్క; అక్ష = ఇంద్రియము లనెడి; వాజినః = గుఱ్ఱములు; తవ = నీ యొక్క; అంఘ్రి = పాదము లనెడి; మందురామ్ = గుఱ్ఱములశాలను; సమాసాద్య = పొంది; అపాస్తవేగాః = విడిచిపెట్టిన వడి గలవై; సుశీలతామ్ = మంచి గుణముల భావమును; దధతామ్ = ధరించుఁగాక! పొందుఁగాక!

**తాత్పర్యము :** దేవా! శ్రీకృష్ణా! నా యింద్రియములు మదముచే గర్వించిన గుఱ్ఱములు. వివేక మను పగ్గములను ద్రెంపి వైచునవి. ఎక్కువ వేగము గలవి. అవి నీ పాదములను గుఱ్ఱముల శాలలోఁ బ్రవేశించి, వేగమును విడిచిపెట్టి మంచి శీలమును బొందుఁగాక! 10

**శ్లో॥ పురాతనానాం వచసామగోచరం**
**మహేశితారం పురుషోత్తమం పతిమ్ ।**
**అపాస్య తం త్వాం నిరపత్రపా సతీ**
**సతీ మతిర్మే కథమన్యమేష్యతి? ॥ 11**

**ప్రతిపదార్థము :** శ్రీకృష్ణా! పురాతనానామ్ = ప్రాచీనము లైన, వచసామ్ = వాక్కులకు ననఁగా వేదములకు; అగోచరమ్ = గోచరము కాని; మహా + ఈశితారమ్ = గొప్ప ప్రభువును; పురుష + ఉత్తమమ్ = పురుషులలో నుత్తముఁ డవును; పతిమ్ = భర్తవు నగు; తం త్వామ్ = అట్టి నిన్ను; అపాస్య = విడిచిపెట్టి; నిర్ + అపత్రపా = సిగ్గు లేనిది; సతీ = యగుచు; మే = నా యొక్క; మతిః = బుద్ధి యను; సతీ = పతివ్రత; అన్యమ్ = ఇతరుని (అన్యదేవతను); కథమ్ = ఎట్లు? ఏష్యతి = చేరఁగలదు.

**తాత్పర్యము :** వేదములకు గోచరము గాని వాఁడు; జగత్ప్రభువు, పురుషోత్తముఁడు భర్తయు నగు నిన్ను విడిచిపెట్టి నా బుద్ధి యను పతివ్రత సిగ్గు లేనిదై యన్యదేవతల నెట్లు చేరఁగలదు? ఎన్నఁడు చేరలేదని భావము.

**విశేషము :** విష్ణుమూర్తియే మోక్షప్రదాతగాని యన్యదేవతలు గారు.

*శ్లో॥ ఆరోగ్యం భాస్కరాదిచ్ఛేచ్ఛ్రియమిచ్ఛేద్ధుతాశనాత్ ।*
*ఐశ్వర్యమీశ్వరాదిచ్ఛేన్మోక్షమిచ్ఛేజ్జనార్దనాత్ ॥*

సూర్యు నుండి యారోగ్యమును గోరవలయును. అగ్ని నుండి లక్ష్మిని సంపదలను గోరవలయును. ఈశ్వరు నుండి యైశ్వర్యమును గోరవలయును. శ్రీమహావిష్ణువు నుండి మోక్షమును గోరవలయు ననువచనము ననుసరించి విష్ణువు మోక్షప్రదాత యని తెలిసియు నా బుద్ధి పతివ్రత యయ్యు భర్త వగు నిన్ను విడిచి యన్యుల నెట్లు చేరఁగల దని భావము.

'సతీ సతీ' యనుచోట రెండేసి హల్లు లర్థభేదముతో రెండు మాఱు లావృత్త మగుటచే ఛేకానుప్రాసము. 11

**శ్లో॥ న జాగ్రతా స్వప్నగతేన వా మయా**
**సమీహితం తే కరుణాలవాదృతే ।**
**గిరం మదీయాం యది వేత్సి తాత్త్వికీం**
**తదా జగన్నాయక! మామురీకురు ॥ 12**

**ప్రతిపదార్థము :** జగత్ + నాయక = లోకముల కధిపతి వైన శ్రీకృష్ణా!; జాగ్రతా = మెలఁకువగా నున్నప్పుడు గాని; వా = లేక; స్వప్నగతేన = నిదురలోఁ గలగాంచు నపుడు

గాని; మయా = నా చేత; తే = నీ యొక్క; కరుణాలవాత్ + ఋతే = దయాలేశము కంటె నన్యము; న సమీహితమ్ = కోరcబడలేదు. తాత్త్వికీమ్ = తత్త్వము తెలిసిన; మదీయామ్ = నా యొక్క; గిరమ్ = వాక్కును; యది వేత్సి = తెలిసికొనుచున్నవాcడ వైనచో; తదా = అప్పుడు; మామ్ = నన్ను; ఉరీకురు = అంగీకరింపుము.

**తాత్పర్యము :** జగన్నాయకా! శ్రీకృష్ణా! జాగ్రదవస్థ యందుc గాని; స్వప్నావస్థ యందుc గాని; నీ కృపాలవము తప్ప నన్యమును నేను గోరుటలేదు. తాత్త్విక మైన నా వచనమును నీ వెఱింగినచో నప్పుడు నన్ను నీ భక్తునిగా నంగీకరింపుము.

**విశేషము :** 'ఋతే' యనునది 'వినా' యను నర్థములో నవ్యయము. 'పృథ గ్వినా హిరు జ్నానాఽన్తరేణ ర్తే చ వర్జనే' (8-8-4) అని వైజయంతీ కోశము. 12

**శ్లో॥ అయి! దీనతరం దయానిధే!**
**దురవస్థం సకలైః సముజ్ఝితమ్ ।**
**అధునాపి న మాం నిభాలయన్**
**భజసే హా! కథమశ్మచిత్తతామ్? ॥ 13**

**ప్రతిపదార్థము :** అయి = ఓయీ! దయానిధే = కరుణకు నిధి వైన శ్రీకృష్ణా! దీనతరమ్ = మిక్కిలి దీనుని; సకలైః = అందఱచే; సముజ్ఝితమ్ = విడిచిపెట్టcబడిన వానిని; దురవస్థమ్ = దురవస్థకు లోనైన వానిని; మామ్ = నన్ను; అధునా + అపి = ఇప్పుడు కూడ; న నిభాలయన్ = మంచిమాటలతో నోదార్పకుండ; హా = అయ్యో! అశ్మచిత్తతామ్ = ఱాతి వంటి మనస్సును; కథమ్ భజసే = ఎట్లు భజించుచున్నావు? ఎట్లు పూనుచున్నా వని భావము.

**తాత్పర్యము :** ఓ కరుణానిధీ! శ్రీకృష్ణా! అందఱ చేతను విడిచిపెట్టcబడి మిక్కిలి దీనుcడనై దురవస్థలో నున్న నన్ను 'నీకే భయము లేదు' మొదలగు మంచి పరిభాషణములతో నోదార్పక యిప్పుడు కూడ నయ్యో! పాషాణ హృదయమును బూనుచుంటి వేల?

**విశేషము :** ఈ శ్లోకము నుండి 56వ శ్లోకము వఱకు వియోగినీ వృత్తములు. **'విషమే ససజా గరు స్సమే సభరా లోఽథ గురుద్వియోగినీ'**

బేసి పాదములనcగా 1-3 పాదములందు 'స - స - జ - గ' గణములు, సరి పాదములనcగా 2-4 పాదములందు 'స - భ - ర - లగ' గణములు నున్నచో వియోగినీవృత్త మని వృత్తరత్నాకరము. 13

శ్లో॥ సుమహన్తి జగన్తి బిభ్రత-
స్తవ యో నావిరభూన్మనాగపి ।
స కథమ్ పరమాప్త! దేహినాం
పరమాణోర్మమ ధారణే శ్రమః ॥ 14

**ప్రతిపదార్థము :** పరమ + ఆప్త! = మిక్కిలి యాప్తుఁడ వైన శ్రీకృష్ణా!; సుమహంతి = మిక్కిలి పెద్దవి యగు; జగంతి = లోకములను; బిభ్రతః = భరించుచున్న; తవ = నీకు; మనాక్ + అపి = కొంచెము కూడ; యః = ఎట్టి; శ్రమః = అలసటయు; న + ఆవిః + అభూత్ = ఆవిర్భవింప లేదు, పుట్టలేదు; దేహినామ్ = శరీరధారులలో; పరమాణోః = మిక్కిలి చిన్నవాఁడ నైన; మమ = నా యొక్క; ధారణే = ధరించుటయందు కథమ్ = ఎట్లు? సః = ఆ; శ్రమః = శ్రమము; ఆవిర్భవించుచున్నది?

**తాత్పర్యము :** పరమాప్తా! శ్రీకృష్ణా! మిక్కిలి పెద్దవైన లోకముల నన్నింటిని భరించుటలో నీ కిసుమంతయు శ్రమము గల్గుట లేదు. కాని దేహధారులలోఁ బరమాణువు వలె మిక్కిలి చిన్నవాఁడనైన నన్ను భరించుటలో నా యలసట యేల కల్గుచున్నది? 14

శ్లో॥ నితరాం వినయేన పృచ్ఛతే
సువిచార్యోత్తరమత్ర యచ్ఛ మే ।
కరితో గిరితోఽప్యహం గురు-
స్త్వరితో నోద్ధరసే యదద్య మామ్ ॥ 15

**ప్రతిపదార్థము :** శ్రీకృష్ణా! నితరామ్ = మిక్కిలి; వినయేన = వినయముతో; పృచ్ఛతే = అడుగుచున్న (ప్రశ్నించుచున్న); మే = నాకు; సువిచార్య = బాగుగానాలోచించి; అత్ర = ఇక్కడ; ఉత్తరమ్ = సరియగు సమాధానమును; యచ్ఛ = ఇమ్ము; యత్ = ఏదనఁగా; మామ్ = నన్ను; త్వరితః = త్వరగలవాఁడవై; అద్య = ఇప్పుడే; న + ఉద్ధరసే = ఉద్ధరించుట లేదు; కరితః = ఏనుఁగు కంటెను; గిరితః = పర్వతము కంటెను; అపి = కూడ; అహమ్ = నేను; గురుః = బరువైనవాఁడనా?

**తాత్పర్యము :** శ్రీకృష్ణా! నేను వినయముతో నిన్నొక్క ప్రశ్న అడుగుచున్నాను. బాగుగా నాలోచించి దానికి సమాధానము చెప్పుము. నీవు గజేంద్రుని రక్షించినావు. ఏనుఁగు జంతువులలో నెల్ల బరువైనది. నీవు గోవర్ధన పర్వతము నెత్తినావు. ఆ పర్వతము కూడ నెక్కువ బరువైనది. నేనా కరి కంటెను గిరి కంటెను బరువైన వాఁడనా? నన్నుద్ధరింపవేమి? 15

**విశేషము :** 'కరితో గిరితో' – అని తెలుఁగు కవుల వలె గిగ్యాదేశమును వాడినాఁడు. సూ॥ నిందయందామ్రేడితంబు నాద్యక్షరములకు హ్రస్వదీర్ఘములకు గి గీ లగు. కుంభకర్ణుఁడు

గింభకర్ణుడు, రావణుఁడు గీవణుఁడు. (బాల-ప్రకీర్ణ-22) అని చిన్నయసూరి. జగన్నాథ పండితరాయలు తెలుఁగు వాఁడే కదా!

**శ్లో॥ న ధనం న చ రాజ్యసమ్పదం**
**నహి విద్యామిదమేకమర్థయే ।**
**మయి ధేహి మనాగపి ప్రభో!**
**కరుణాభఙ్గితరఙ్గితాం దృశమ్ ॥** **16**

**ప్రతిపదార్థము :** ప్రభో = ప్రభూ! శ్రీకృష్ణా! ధనమ్ = డబ్బును; న + అర్థయే = కోరను; రాజ్యసంపదం చ = రాజ్యసంపదను గూడ; న + అర్థయే = కోరను; విద్యాం హి = చదువును గూడ; న + అర్థయే = కోరను; ఇదమ్ = దీనిని; ఏకమ్ = ఒక్కదానినే; అర్థయే = అడుగుచున్నాను. కరుణా = దయ యొక్క; భంగి = పద్ధతితో; తరంగితామ్ = ఒక దానిపై నొకటిగా వచ్చు కెరటముల వలెఁ బెల్లుబుకుచున్న; దృశమ్ = నీ కటాక్షమును; మనాక్ + అపి = కొంచెమైనను; మయి = నా యందు; ధేహి = ఉంచి పోషింపుము.

**తాత్పర్యము :** ప్రభూ! శ్రీకృష్ణా! నేను నిన్ను ధన మర్థింపను. రాజ్యసంపదను గూడ యాచింపను. విద్యను గూడ నడుగను. కృపాతరంగ పంక్తితోఁ బెల్లుబుకుచున్న నీ చూపును నా యందుంచి నన్నుఁ బోషింపుము. దీని నొక్క దానినే నిన్ను నేనర్థించుచున్నాను.

**విశేషము :** ఈ శ్లోకము రసగంగాధరములో భావధ్వని కుదాహరణముగా నుద్ధరింపఁబడినది.

**"ఇదం వోదాహరణమ్ - 'న ధనం న చ రాజ్యసంపదమ్... ...'**

అత్ర ధనాద్యపేక్షాశూన్యస్య భగవద్దృగంత పాతాభిలాషో హి భగవత్యత్యంతానురక్తిం వ్యనక్తి"

ఇక్కడ ధనాదులయందుఁ గోరిక లేని భక్తుఁడు భగవంతుని దయా కటాక్షపాతమునే కోరుచున్నాఁడు గావున భక్తునకు భగవంతుని యందుఁ గల యత్యంతానురక్తి వ్యఙ్గ్యమానమగు చున్నది. కావున నీ పద్యము రతిభావధ్వని కుదాహరణము. ఈ శ్లోకము శ్రీచైతన్యమహాప్రభువు యొక్క -

**శ్లో॥ న ధనం న జనం న సున్దరీం**
**కవితాం వా జగదీశ కామయే ।**
**మమ జన్మని జన్మ నీశ్వరే**
**భవతా ద్భక్తి రహైతుకీ త్వయి ॥**

అను శ్లోకమున కనుకరణము. 16

శ్లో॥ అయమత్యధమోఽపి నిర్గుణో
దయనీయో భవతా దయానిధే! ।
వమతామ్ ఫణినాం విషానలం
కిము నానన్దయితా హి చన్దనః ॥ 17

**ప్రతిపదార్థము :** దయానిధే! = కరుణకు శేవధి (ధనస్థానము) వైన శ్రీకృష్ణా! అయమ్ = వీఁడు (ఈ జగన్నాథకవి); అతి + అధమః = మిక్కిలి నికృష్టుఁడు; నిర్గుణః + అపి = ఏ మంచి గుణములు లేనివాఁడు కూడ; (అయినను); భవతా = నీ చేత; దయనీయః = కనికరింపఁ దగిన వాఁడు; విష + అనలమ్ = విషమను నగ్నిని; వమతామ్ = క్రక్కుచున్న; ఫణినామ్ = పాములకు; చందనః = మంచిగంధపుఁజెట్టు; హి = నిశ్చయముగా; ఆనందయితా = ఆనందమును గూర్చునది; న కిము? = కాదా?

**తాత్పర్యము :** కృపానిధీ! శ్రీకృష్ణా! నేను మిక్కిలి యధముఁడను. మంచి గుణములు లేని వాఁడను. అయినను నీవు నన్ను దయతోఁ గనికరింపవలయును. విషాగ్నిని గ్రక్కుచున్న పాములకు గంధపుఁజె ట్టానందము నీయదా?

నేను విషసర్పము వంటి వాఁడ నైనను నీవు చందన వృక్షము వంటి వాఁడవు గనుక నిన్నాశ్రయించిన నన్నుఁ గరుణించి కాపాడ వలయునని భావము. 17

శ్లో॥ క్షుధితస్య నహి త్రపాస్తి మే
ప్రతిరథ్యమ్ ప్రతిగృహ్ణతః కణాన్ ।
అకలఙ్క! యశస్కరం న మే
భవదీయోఽపి యదన్యమృచ్ఛతి ॥ 18

**ప్రతిపదార్థము :** అకలంక! = ఏ కళంకము లేని శ్రీకృష్ణా!; క్షుధితస్య = ఆఁకలితో నున్న; ప్రతిరథ్యమ్ = అన్ని రాజమార్గము లందు; కణాన్ = బియ్యపు నూకలను; ప్రతిగృహ్ణతః = ఏరుకొని గ్రహించుచున్న; మే = నాకు; త్రపా = సిగ్గు; నహి అస్తి = లేదు గదా!; కాని; భవదీయః + అపి = నీ వాఁడు కూడ; అన్యమ్ = ఇతరుని; ఋచ్ఛతి = చేరుచున్నాఁడు; యత్ = అనునది యేది కలదో; (తత్ = అది) (యత్తదో ర్నిత్యసంబంధః' అను వచనముచే యత్ప్రయోగముచేఁ దచ్ఛబ్దము నధ్యాహారము చేసికొనవలయును); తే = నీకు; న యశస్కరమ్ = కీర్తినిఁ గల్గఁజేయునది కాదు.

**తాత్పర్యము :** ఎట్టి కళంకము లేని శ్రీకృష్ణా! ఆఁకలితోఁ బ్రతిరాచబాటయందు నూకల నేరుకొని పొట్ట నింపుకొనుచున్న నాకిసుమంతయు సిగ్గులేదు. కాని నీ వాఁడితరులను జేరి యాచించుచున్నాఁ డన్నచో నా యపకీర్తి నీకు వచ్చి యదే నీకుఁ గళంకమగు నని భావము. 18

శ్లో॥ నితరాం నరకేఽపి సీదతః
కిము హీనం గలితత్రపస్య మే ।
భగవన్! కురు సూక్ష్మమీక్షణమ్
పరతస్త్వాం జనతా కిమాలపేత్ ॥ 19

**ప్రతిపదార్థము :** భగవన్ = భగవానుఁడా! శ్రీకృష్ణా!; నితరామ్ = ఎక్కువగా; నరకే + అపి = యమలోకమునందుఁ గూడ; సీదతః = దుఃఖించుచు; గలితత్రపస్య = సిగ్గును విడిచిపెట్టిన; మే = నాకు; కిము హీనమ్ = తక్కువైన దేమి కలదు?; సూక్ష్మమ్ = కొంచె మైనను; ఈక్షణమ్ = నీ దృష్టిని; కురు = నా పై నుంచుము; పరతః = లేనిచో నటు మీఁద; జనతా = జన సమూహము; త్వామ్ = నిన్నుఁ గూర్చి; కిమ్ ఆలపేత్ = ఎట్టి యాలాపములు చేయునో తెలియునా?

**తాత్పర్యము :** భగవంతుఁడా! శ్రీకృష్ణా! సిగ్గును విడిచిపెట్టి యెల్లప్పుడు నెక్కువగా నరకలోకములోఁ గూడ దుఃఖముల ననుభవించు నా కింత కంటెఁ బోవునదేమి కలదు? కాని నా యందు దయా దృష్టి నుంచి నన్నుఁ గావని యెడల నిన్ను జనులందఱు నెట్లాడి పోసికొందురో యాలోచింపుము. నావు సూక్ష్మేక్షికతో విచారించి నన్నుఁ గాపాడు మని భావము.

**విశేషము : గ్రామ జన బంధు సహాయేభ్యస్తల్** (4–2–43) అను పాణినీయ సూత్రముచే జన శబ్దమునకు సమూహార్థములోఁ 'తల్' ప్రత్యయము చేరి 'జనతా' యను రూప మేర్పడును. జనుల యొక్క సమూహము జనత. 19

శ్లో॥ నరకే నిజకర్మకల్పితా
భజతో మే మహతీరపి వ్యథాః ।
ఇదమేకమసహ్యమీక్షకా
యదనాథం నిగదన్తి మాం విభో! ॥ 20

**ప్రతిపదార్థము :** విభో! = ప్రభూ! శ్రీకృష్ణా!; నిజ = నా యొక్క; కర్మ = పూర్వజన్మములందుఁ జేసిన కర్మములచే; కల్పితాః = కల్పించుకొనఁబడిన; మహతీః = గొప్పవైన; వ్యథాః = దుఃఖములను; నరకే = యమలోకములో; భజతః = అనుభవించుచున్న; మే = నాకు; ఇదమ్ = ఇది; ఏవమ్ = ఒక్కటే; అసహ్యమ్ = సహింపరానిది; యత్ = అదేది యనఁగా; ఈక్షకాః = నన్నుఁ జూచు జనులు; మామ్ = నన్ను; అనాథమ్ = అనాథుఁ డని; నిగదంతి = పలుకుచున్నారు.

**తాత్పర్యము :** ప్రభూ! శ్రీకృష్ణా! పూర్వజన్మములందు నేఁజేసిన కర్మములకుఁ దగిన గొప్ప

గొప్ప దుఃఖములను నరకలోకములో ననుభవించుచున్న నాకు సహింపరాని దేముండును? కాని జనులందఱు నిన్ను నమ్మికొన్న నన్ను ననాథుఁడని పలుకుట యొక్కటే సహింప రానిదని భావము. 20

శ్లో॥ **మృగదన్తి ముఖాన్ మయా సహ**
**ప్రతిరుద్ధాన్ భవజాలబన్ధనే ।**
**తవ మామపహాయ ముఞ్చతః**
**కరుణా కిం? న భినత్తి మానసమ్ ॥** **21**

**ప్రతిపదార్థము :** శ్రీకృష్ణా!; మయా సహ = నాతోఁ గూడ; భవజాల బంధనే = సంసార మనెడి వల యొక్క బంధనములో, లేక సంసార సమూహము యొక్క బంధనములో; 'జాలం సమూహ ఆనాయః' అని యమరము; ప్రతిరుద్ధాన్ = అడ్డగింపఁబడిన; మృగదంతి ముఖాన్ = పశువులు, ఏనుఁగులు మొదలగు వానిని; మామ్ = నన్ను; అపహాయ = విడిచిపెట్టి; ముంచతః = విడిచి పెట్టుచున్న; నన్నుఁ దప్పఁ దక్కిన జంతువులను విడిచి పెట్టుచున్న యని భావము. తవ = నీ యొక్క; మానసమ్ = మనస్సును; కరుణా = దయ; న భినత్తి కిమ్? = భేదించుట లేదా? యేమి?

**తాత్పర్యము :** శ్రీకృష్ణా! నావలెనే సంసార మనెడి వలలో బంధింపఁ బడిన; మృగములను, ఏనుఁగులను గూడ విడిచిపెట్టుచున్నావు. అనఁగా బంధముల నూడ్చి రక్షించుచున్నావు. కాని నన్ను మాత్రమీ భవబంధము నుండి విడిపించి మోక్షము ప్రసాదించుటలేదు. గజేంద్రాదులకు ముక్తి నొసఁగితివి. నన్ను మాత్రము సంసారజాలములో బంధించుచుంటివి. ఆ గజేంద్రాదులపైఁ జూపిన కరుణను నాపైఁ జూపుటకు నీ మనస్సు కరఁగుట లేదా? యని భావము. 21

శ్లో॥ **నిరుపాధి జనార్తిహారిణం**
**భగవంస్త్వామవగత్య తత్త్వతః ।**
**కృతపుణ్యచయావహేలనం**
**కథమబ్జేక్షణ! మాముపేక్షసే ॥** **22**

**ప్రతిపదార్థము :** భగవన్! = భగవంతుఁడా!; అబ్జేక్షణ! = పద్మముల వంటి కన్నులు గలవాఁడా! శ్రీకృష్ణా!; నిరుపాధి = ఏ యుపాధియు లేని; జన = జనుల యొక్క; ఆర్తి = దుఃఖములను; హారిణమ్ = పోఁగొట్టు వానిని; త్వామ్ = నిన్ను; తత్త్వతః = యథార్థముగా; అవగత్య = తెలిసికొని; కృత = చేయఁబడిన; పుణ్యచయ = పుణ్యముల సమూహము యొక్క; అవహేలనమ్ = తిరస్కారము గల వానిని (చులకన భావముతోఁ బుణ్యకర్మములు

సమూహమును వెక్కిరించి విడిచిపెట్టిన వానిని); మామ్ = నన్ను; కథమ్ = ఎట్లు; ఉపేక్షసే = ఉపేక్షించుచున్నావు?

**తాత్పర్యము :** ఓ భగవంతుఁడా! పుండరీకాక్షా! ఏ గతియు లేని జనుల యొక్క దుఃఖములను బాపు వాఁడవు నీ వను వేదాంత తత్త్వమును దెలిసికొని నిన్నే నమ్ముకొని; పుణ్యకర్మములను వేళాకోళము చేసి విడిచిపెట్టితిని. అట్టి నన్ను నీవేల యుపేక్షించుచుంటివి?

*శ్లో॥ అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే ।*
*తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ ॥ (భ.గీ. 9-22)*

అన్యచింత లేక యే జనులు నన్నే యుపాసింతురో వారి యోగక్షేమములను నేనే చూచుకొందును.

*శ్లో॥ సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ ।*
*అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః ॥ (భ.గీ. 18-66)*

అన్ని ధర్మములను విడిచిపెట్టి నన్నే శరణు పొందుము. సర్వపాపముల నుండి నిన్ను విముక్తునిఁ జేయుదును దుఃఖింపకుము.

ఈ విధముగా నీవు చెప్పిన వేదాంత తత్త్వవాక్యములను దెలిసికొని నిన్నే నమ్మి యే పుణ్యములు చేయకుంటిని. అట్టి నన్నుపేక్షించెద వేల? నీవే నన్ను విడిచిపెట్టినచో నాకింక దిక్కెవ్వరని భావము. 22

**శ్లో॥ సతతం నిగమేషు శృణ్వతా**
**వరద! త్వామ్ పతితానుపావనమ్ ।**
**పురుపాపముపాస్యతేఽ నిశం**
**త్వయి విశ్వాసధియా మయా విభో! ॥ 23**

**ప్రతిపదార్థము :** విభో! = ప్రభూ!; వరద = వరముల నిచ్చువాఁడా! శ్రీకృష్ణా!; సతతమ్ = ఎల్లప్పుడు; నిగమేషు = వేదములందు; పతిత + అనుపావనమ్ = పతితులను (పాపులను) పవిత్రులుగాఁ జేయువానిగా; త్వామ్ = నిన్ను; శృణ్వతా = వినుచున్న; మయా = నా చేత; త్వయి = నీ యందు; విశ్వాసధియా = విశ్వాస బుద్ధితో; అనిశమ్ = ఎల్లప్పుడు; పురు = ఎక్కువగా; పాపమ్ = పాపమే; ఉపాస్యతే = ఉపాసింపఁబడుచున్నది, చేయఁబడుచున్నది.

**తాత్పర్యము :** ప్రభూ! వరదా! శ్రీకృష్ణా! నీవు పతితపావనుఁడవని వేదములు చెప్పఁగా నెప్పుడును విని, నీ యందుఁ గల నమ్మకముతోఁ బుణ్యములను విడిచిపెట్టి యెల్లప్పుడు పాపములనే చేయుచుంటిని. నన్ను రక్షింపుమని భావము. 23

శ్లో॥ **సుకృతం న కృతమ్ పురా కదా-**
**పృథ సర్వం కృతమేవ దుష్కృతమ్ ।**
**అధునా గలితహ్రియా మయా**
**భగవంస్త్వామ్ ప్రతి కిం నిగద్యతామ్ ॥** **24**

**ప్రతిపదార్థము :** భగవన్! = భగవంతుఁడా! శ్రీకృష్ణా!; పురా = ఇంతకు ముందు; కదా + అపి = ఎప్పుడును గూడ; సుకృతమ్ = పుణ్యము; న కృతమ్ = చేయఁబడలేదు. అథ = ఇంక; సర్వమ్ = అంతయు; దుష్కృతమ్ = పాపము; ఏవ = మాత్రమే; కృతమ్ = చేయఁబడినది. అధునా = ఇప్పుడు; గలితక్రియా = సిగ్గులేని; మయా = నాచేత; త్వామ్ ప్రతి = నిన్ను గూర్చి; కిమ్ = ఏమి?; నిగద్యతామ్ = చెప్పఁబడ వలయును?

**తాత్పర్యము :** భగవంతుఁడా! శ్రీకృష్ణా! ఇంతకు ముందెప్పుడు నేను పుణ్యమును జేయలేదు. ఇంకఁ జేయుటకు వీలైన పాపముల నన్నింటిని జేసితిని. ఇట్లు సిగ్గు లేని నేనిప్పుడు నీ ముందేమి విన్నవింపఁగలను? 24

శ్లో॥ **మదకామవిమోహమత్సరా-**
**రిపవస్త్వత్పుర ఏవ విహ్వలమ్ ।**
**ధృతశార్ఙ్గగదారినన్దక!**
**ప్రతికర్షన్తి కథం న లజ్జసే? ॥** **25**

**ప్రతిపదార్థము :** ధృత = ధరింపఁబడిన; శార్ఙ్గ = శార్‌ఙ్గమను విల్లు; గదా = గద; అరి = చక్రము (అరములు = ఆకులు = చక్రము మధ్యలో నున్న కమ్ములు. అరములు గలది యరి = చక్రము); నందక! = నందకమను కత్తి గలవాఁడా! శ్రీకృష్ణా!; త్వత్ = నీ యొక్క; పుర ఏవ = ముందుగానే; విహ్వలమ్ = అవయవముల స్వాధీనము తప్పిన; (మామ్ = నన్ను); మద = మదము (మత్తు); కామ = కోరికలు; విమోహ = విశేషమైన మోహము; మత్సరః = మచ్చరము నను, ఇది యుపలక్షణము. క్రోధలోభములను గూడ గ్రహింపవలెను. రిపవః = శత్రువులు; ప్రతికర్షంతి = వెనుకకు లాగు చున్నవి. (ఇది చూచియు) కథం న లజ్జసే = ఏల సిగ్గు పడకుంటివి?

**తాత్పర్యము :** శార్ఙ్గమను ధనుస్సు; కౌమోదకి యను గద; సుదర్శన మను చక్రము; నందక మను ఖడ్గము శ్రీమహావిష్ణువు యొక్క యాయుధములు.

*శ్లో॥ శంఖో లక్ష్మీపతేః పాంచజన్యః చక్రం సుదర్శనః ।*
*కౌమోదకీ గదా ఖడ్గో నందకః కౌస్తుభో మణిః ॥* అని యమరము

వీనిని ధరించిన శ్రీమహావిష్ణువును గాంచి భయంకరులగు రాక్షసులే పాటిపోవుదురు. ఈ

యాయుధములు కూడ హిరణ్యాక్ష రావణాది బహిశ్శత్రువులనే రూపుమాపుచున్నవి గాని మానవుల మనస్సులలో దాఁగి యున్న కామక్రోధాది శత్రువులను బాఱఁద్రోల లేకున్నవి. ఈ శ్లోకములో మదము మొదలగునవి నాలుగే చెప్పఁబడినవి. ఉపలక్షణముచేఁ గ్రోధ లోభములను గూడ గ్రహింపవలయును. (స్వబోధకత్వే సతి స్వేతర బోధకత్వ ముపలక్షణమ్. స్వగ్రాహకత్వే సతి స్వేతర గ్రాహకత్వ ముపలక్షణమ్. చెప్పిన విషయముల తో పాటు చెప్పని యవసర విషయములను గూడ గ్రహించుట యుపలక్షణము.) కామ – క్రోధ – లోభ – మోహ – మద – మత్సరము లంతశ్శత్రువులు. కామము = కోరిక. క్రోధము = కోపము. లోభము = పిసినికొట్టు తనము. మోహము = అలభ్య వస్తువులను బొందవలెనని, లబ్ధవస్తువులను దాఁచవలెననెడి విపరీత మగు నిచ్ఛ – అజ్ఞానము. మదము = లోకములో నన్ను మించిన వాఁడు లేఁడను గర్వము. మత్సరము = ఈర్ష్య (ఈసు) – తన కంటె గొప్పవారిని గాంచి నపుడు గలుగు నసూయ . వీనికే **యరిషడ్వర్గము** లని పేరు.

శ్రీకృష్ణా! ఆయుధములను ధరించి నీ వెదురుగా నున్నను నీముందే మదాది శత్రువులు నన్ను వెనుకకు లాఁగుచున్నవి. ఈ యాయుధములతో ఘోర రాక్షసులను జయించు నీకు భక్తులను దిప్పలు పెట్టుచున్న వీనిని జూచినపుడు సిగ్గు కల్గుట లేదా? నీ యాయుధములతో నా యంతశ్శత్రువులను గూడ సంహరించి నన్నుఁ గాపాడు మని భావము.

ఈ శ్లోకము రసగంగాధరములోఁ బరికరాలంకార ప్రకరణములో నుదాహరింపఁ బడినది.

**యథావా – 'మదకామవిమోహమత్సరాః ... ...'**

అత్రాప్యుపేక్షానౌచిత్యస్య 'తావక' శబ్దప్రతిపాదితేన స్వామిభృత్యభావేనైవ నిష్పన్న శరీరస్య ప్రకర్షకం 'ధృతశార్ఙ్గే' త్యాది విశేషణమమోఘశస్త్రాస్త్రసమ్పన్నస్య సమక్షమేవ రిపుభిః కృష్యమాణం దాసముపేక్షమాణస్యాకీర్తిర్భవిత్రీ తవేత్యాకూతగర్భమ్ ... ... తృతీయస్తు 'ధృతశార్ఙ్గగదాదినన్దక' ఇత్యత్ర.

**'విశేషణానాం సాభిప్రాయత్వమ్ పరికరః'** విశేషణములు సాభిప్రాయములైనచోఁ బరికరాలంకారము. ఈ శ్లోకములో "ధృతశార్ఙ్గగదారినందక' యను విశేషణము సాభిప్రాయ మగుటచేఁ బరికరాలంకారము. ఈ శ్లోకము నందలి రెండవపాదములో 'విహ్వలమ్' అను దానికి బదులుగాఁ దావకమ్ అను పాఠము గలదు. అప్పుడు 'తావకమ్ = నీ వానిని' అని యర్థము చెప్పుకొనవలయును.

ఇక్కడ – నన్నుపేక్షించుట నీకుచితముగా దనుటకుఁ 'దావక' శబ్దముచేఁ బ్రతిపాదిత

మైన స్వామిభృత్యభావము చేతనే (స్వామి – శ్రీమహావిష్ణువు. భృత్యుఁడు – జగన్నాథకవి. సమర్థుఁడైన స్వామి శత్రువుల సమక్షము నందే భయపడి లొంగి పోవుచున్న తన భృత్యుని రక్షింపకుండ నుపేక్షించుట తనకే యవమానము) నిష్పన్నశరీరమైన దానికి 'ధృతశార్ఙ్గ గదారినందక'యను విశేషణము – అమోఘశస్త్రాస్త్రసంపన్నుఁడ వైన నీ ముందే శత్రువులచే లాఁగఁబడుచున్న నీ దాసు నుపేక్షించుచున్న నీ కపకీర్తి గల్గు నను నభిప్రాయగర్భముగా నున్నది... ...

'ధృతశార్ఙ్గ గదారినందక!' యను విశేషణము గల యీ శ్లోకములో వాచ్యాయమాన మగు వ్యంగ్యము గల యుపస్కారకవ్యంగ్య గర్భమగు పరికరాలంకారము గలదు. 25

**శ్లో॥ అయి! గర్తముఖే గతః శిశుః**
**పథికే నాపి నివార్యతే జవాత్ ।**
**జనకేన పతన్ భవార్ణవే**
**న నివార్యో భవతా కథం? విభో! ॥ 26**

**ప్రతిపదార్థము :** అయి = ఓయీ! శ్రీకృష్ణా!; గర్తముఖే = గోతి ముందునకు; గతః = వెళ్ళిన; శిశుః = పసిపిల్లవాఁడు; పథికేన + అపి = బాటసారిచేఁ గూడ; జవాత్ = వేగముతో; నివార్యతే = నివారింపఁబడుచున్నాఁడు; భవ + అర్ణవే = సంసార సముద్రములో; పతన్ = పడుచున్న; (అహమ్ = నేను); జనకేన = తండ్రివైన; భవతా = నీ చేత; కథమ్ = ఎట్లు?; న నివార్యః = నివారింపఁదగిన వాఁడను గాను?

**తాత్పర్యము :** గోతి దగ్గఱకు వెళ్ళుచున్న పసిపిల్లవానిని బాటసారి కూడ వేగముగా నడ్డుపడి రక్షించుచున్నాఁడు. తండ్రీ! శ్రీకృష్ణా! నేను సంసారసముద్రములోఁ బడుచున్నాను. నన్ను నీవేల నివారించి రక్షించుటలేదు? 26

**శ్లో॥ సుకృతప్రియ! మాన్యథాఽస్తు తే**
**సుకృతిభ్యః సుఖదస్య సుప్రథా ।**
**అపి పాపమబిభ్రతస్తు మాం**
**తవ విశ్వమ్భరనామ దుర్లభమ్ ॥ 27**

**ప్రతిపదార్థము :** సుకృతప్రియ! = పుణ్యముల కిష్టపడు శ్రీకృష్ణా!; సుకృతిభ్యః = పుణ్యవంతులకు; సుఖదస్య = సుఖముల నిచ్చు; తే = నీకు; సుప్రథా = మంచి కీర్తి; అన్యథా = ఇంకొక విధముగా; మా + అస్తు = కాఁగూడదు; పాపమ్ = పాపాత్ముఁడనైన; మామ్ + అపి = నన్ను గూడ; అబిభ్రతః = భరింపని, తవ తు = నీకుఁ గూడ; విశ్వంభర నామ = విశ్వంభరుఁ డను పేరు; దుర్లభమ్ = దుర్లభ మగును.

**తాత్పర్యము :** పుణ్యప్రియుఁడవైన శ్రీకృష్ణా! పుణ్యాత్ములకు సుఖము నిచ్చు వాఁడ వను నీ కీర్తి కన్యథాత్వము కలుగకుండుఁగాక! నీ కీర్తి పోవకుండుఁగాక! సమస్త విశ్వమును భరించుటచే విశ్వంభరుఁడవని నీకుఁ బేరు వచ్చినది. నీవు నా వంటి పాపాత్ములను గూడ భరించినచో నీకా పేరు సార్థకమగును. అట్లు చేయని యెడల నీ కాపేరు నేతిబీరకాయ వంటి దగు నని భావము. 27

**శ్లో॥ వచనైః పరుషైరిహ ప్రభో!**
**యది రోషం సముపాగతోఽసి మే ।**
**ముఖరం కృతకోటికల్మషం**
**కరుణాబ్ధే! జగతోఽ పసారయ ॥ 28**

**ప్రతిపదార్థము :** ప్రభో! = జగత్పతీ! శ్రీకృష్ణా!; మే = నా యొక్క; పరుషైః = కఠినము లైన; వచనైః = వాక్కులచే; ఇహ = ఇక్కడ (ఈ స్తోత్రములో); రోషమ్ = కోపమును; సముపాగతః + అసి + యది = పొందినవాఁడ వైనచో; ముఖరమ్ = ఎక్కువగా వాఁగు వాచాలుని; కృతకోటికల్మషమ్ = కోటిపాపములు చేసిన వానిని; (మామ్ = నన్ను) కరుణా + అబ్ధే = దయాసముద్రా! జగతః = ఈ లోకము నుండి; అపసారయ = తొలఁగునట్లు చేయుము.

**తాత్పర్యము :** ఇక్కడ నేను నిన్నుఁ గూర్చి పలికిన నిష్ఠురములైన మాటలకు నీకు రోషము వచ్చిన యెడల నన్నెక్కువగా వాఁగుచున్న వాచాలుఁడనని యెంచి యో దయాసముద్రా! శ్రీకృష్ణా! నన్నీ లోకము నుండి గెంటి వేయుము. నీలోకమునకుఁ దీసికొని వెళ్ళి మోక్షము ప్రసాదింపు మని భాము. 28

**శ్లో॥ యది వీక్ష్య దదాసి మత్కృతిం**
**న మయైవ ప్రతిగృహ్యతే తథా ।**
**అథచేన్నిజమాశయమ్ ప్రభో!**
**పరితుష్టః శిరసా వహామి తత్ ॥ 29**

**ప్రతిపదార్థము :** ప్రభో! = ప్రభూ! శ్రీకృష్ణా!; (మామ్ = నన్ను); వీక్ష్య = చూచి; మత్‌కృతిమ్ = నేను చేసిన దానిని; యది దదాసి = నాకే నీ విచ్చుచున్నచో; తథా = అప్పుడు; మయా + ఏవ = నా చేతనే; న ప్రతిగృహ్యతే = ప్రతిగ్రహింపఁబడదు; నిజమ్ = నీ యొక్క; ఆశయమ్ = అభిప్రాయము; అథచేత్ = ఇంక నదియే యైనచో; తత్ = దానిని; పరితుష్టః = మిక్కిలి సంతోషము నొందిన వాఁడనై; శిరసా = నా తలతో; వహామి = మోయుదును.

**తాత్పర్యము :** ఓ ప్రభూ! శ్రీకృష్ణా! దీనుఁడ నగు నన్నుఁ జూచి నేను జేసిన దానిని నాకే యీయఁ దలఁచినచో దానిని బరిగ్రహింపను. నేను పాపములనే చేసితిని గావున నా

పాపఫలమునే నా కీయఁదలచినచో దానిని నేను స్వీకరింపను. అట్లుగాక యింకఁ బాపముల నుండి నన్నుద్ధరించు నాశయము నీకున్నచో దానిని సంతోషముతో నేను స్వీకరింతును. నేను జేసిన దానినే నాకిచ్చుటలో నీ గొప్పతన మేమున్నది? ఇంక నేను చేయని పుణ్యమును నాకిచ్చినచో నీవు గొప్పవాఁడ వగుదువని భావము. 29

**శ్లో॥ పతితోఽ ప్యతిదుర్గతోఽపి స**
**న్నకృతజ్ఞో నిఖిలాగసామ్ పదమ్ ।**
**భవదీయ ఇతీరయంస్త్వయా**
**దయనీయస్త్రపయైవ కేవలమ్ ॥ 30**

**ప్రతిపదార్థము :** శ్రీకృష్ణా!; పతితః + అపి = నే ననేకపాపములు చేసి పతితుఁడనైనను; దుర్గతః + అపి = దుర్గతులను జెందిన వాఁడనైనను; అకృతజ్ఞః సన్ = చేసిన మేలును మఱచిన కృతఘ్నుఁడ నైనను; నిఖిల = సమస్తములైన; ఆగసామ్ = అపరాధములకు; పదమ్ = స్థానమైనను; త్రపయా + ఏవ = సిగ్గు తోడనే; భవదీయః = నేను నీ వాఁడను; ఇతి = అని; ఈరయన్ = వణఁకుచుఁ బలుకుచున్నాఁడ నని యెంచి; కేవలమ్ = నిర్ణయముగా; త్వయా = నీ చేత; దయనీయః = కనికరింపఁదగిన వాఁడను.

**తాత్పర్యము :** శ్రీకృష్ణా! వీఁడు పతితుఁడు; దుర్గతినిఁ జెందినవాఁడు; కృతఘ్నుఁడు, అనేకాపరాధములు చేసినవాఁడు నైనను సిగ్గుతో నీ వాఁడనని పలుకుచున్నాఁడని యెంచి నీవు నన్నుఁ గనికరింపవలయు నని భావము. 30

**శ్లో॥ సుకృతప్రకృతౌ జనే త్వయా**
**కృతయా కిం? కృపయా కృపానిధే! ।**
**యది మాదృశి సా విధీయతే**
**తవ కీర్తిర్వద! కీదృశీ? తదా ॥ 31**

**ప్రతిపదార్థము :** కృపానిధే = దయకు నిధివైన శ్రీకృష్ణా!; సుకృత ప్రకృతౌ = ప్రకృతిసిద్ధముగా మంచి కార్యములు (పుణ్యములు) చేయు; జనే = జనుని యందు; ఇది జాత్యేకవచనమ్, జనుల యందని యర్థము; త్వయా = నీ చేత; కృతయా = చేయఁబడిన; కృపయా = దయ చేత; కిమ్? = ఏమి గొప్పతనము గలదు?; మాదృశి = నా వంటి వాని యందు; సా = ఆ కృప; యది విధీయతే = విధింపఁబడినచో, (చూపఁబడినచో); తదా = అప్పుడు; తవ = నీ యొక్క; కీర్తిః = ఖ్యాతి; కీదృశీ = ఎట్లుండునో!; వద = చెప్పుము!.

**తాత్పర్యము :** ఓ కరుణానిధీ! శ్రీకృష్ణా! సహజముగాఁ బుణ్యములు చేయువాని యందు నీవు కృప చూపినచో దానిలో నీ గొప్పతన మేమి గలదు? పాపములు చేసిన నా వంటి

వాని యందుఁ గూడ నా దయను జూపినచో నప్పుడు నీ కెట్టి యశస్సు గలుగునో యాలోచించి చెప్పుము. 31

**శ్లో॥ అయి! శైశవలాలితః శిశుః**
**ప్రతిబుద్ధో జనకేన తాడ్యతే ।**
**న కదాపి చ లాలిత స్త్వయా**
**కిము తాడ్యో? భగవన్! కుకర్మభిః ॥ 32**

**ప్రతిపదార్థము :** అయి! = ఓయీ!; భగవన్ = భగవానుఁడా! శ్రీకృష్ణా!; శిశుః = పసిపిల్లవాఁడు; జనకేన = తండ్రిచే; శైశవ = బాల్యమునందు; లాలితః = లాలింపఁబడిన వాఁడై; ప్రతిబుద్ధః = ఎదిగిన పిమ్మట బుద్ధి చెడిన వాఁడై; తాడ్యతే = కొట్టఁబడుచున్నాఁడు. (అహమ్ = నేను); త్వయా = నీ చేత; కదాపి = ఎప్పుడును గూడ; న లాలితః = లాలింపఁబడిన వాఁడను గాను; కుకర్మభిః = చెడ్డపనులచే (పాపకర్మములచే); తాడ్యః కిము? = తాడింపఁదగిన వాఁడనా యేమి?

**తాత్పర్యము :** భగవానుఁడా! శ్రీకృష్ణా! పసిపిల్లవాఁడు తండ్రిచేఁ జిన్నతనములో లాలింపఁబడిన వాఁడై పెరిఁగి పెద్దవాఁడైన పిమ్మటఁ జెడ్డబుద్ధులు గలవాఁడైనచోఁ దాడింపఁబడును. నీవు నన్నెప్పుడు లాలింప లేదు సరి గదా! పాపకర్మము లనుభవింపు మని తాడింతువా యేమి? నేను నీ దెబ్బల కోర్వఁగలనా? యని భావము.

**విశేషము :** ఇక్కడ–

*శ్లో॥ లాలనాద్బహవో దోషాస్తాడనాద్బహవో గుణాః ।*
*తస్మాత్ పుత్త్రం చ మిత్రం చ తాడయేన్నతు లాలయేత్ ॥*

లాలనము వలన ననేక దోషములు గలవు. తాడనము వలన ననేక గుణములు గలవు. అందువలనఁ బుత్త్రుని మిత్రునిఁ దాడింప వలెను గాని లాలింపఁగూడ దను చాణక్యనీతిదర్పణ శ్లోక మిచ్చుట ననుసంధేయము. ఈ శ్లోకమునే పోతనగారు భాగవతములో నిట్లు తెనిఁగించినారు–

*కం॥ లాలనమున బహుదోషము*
*లోలిం బ్రాపించుఁ దాడనోపాయములన్*
*జాల గుణంబులు గలుగును*
*బాలురకును దాడనంబ పథ్యం బరయన్. (భాగ –10స్క–పూర్వ–367) 32*

**అవతారిక :** ఇంత వఱకు నీవిధముగా భగవంతు నుపాలంభించి యిప్పుడు పశ్చాత్తాపముతో స్తోత్రము చేయుట కారంభించుచున్నాఁడు–

**శ్లో॥ అహమేవ హి దోషదూషితో**
**భగవంస్త్వాం సముపాలభే ముధా ।**
**రమణీవిరహజ్వరజ్వల–**
**న్నమృతాంశుం కుమతిర్వినిన్దతి ॥ 33**

**ప్రతిపదార్థము :** భగవన్ = ఓ భగవంతుఁడా! శ్రీకృష్ణా!; అహమ్ + ఏవ = నేనే; హి = నిశ్చయముగా; దోష = తప్పులచే; దూషితః = దూషింపఁబడిన వాఁడను; త్వామ్ = నిన్ను; ముధా = వ్యర్థముగా; ఉపాలభే = నిందించుచున్నాను. కుమతిః = చెడ్డబుద్ధి గల వాఁడు; రమణీ = స్త్రీ యొక్క; విరహ = వియోగముచేఁ గలిగిన; జ్వర = జ్వరముచే; జ్వలన్ = వేఁగుచున్న వాఁడై; అమృతాంశుమ్ = అమృతకిరణములు గల చంద్రుని; వినిందతి = విశేషముగా నిందించుచున్నాఁడు.

**తాత్పర్యము :** భగవంతుఁడా! శ్రీకృష్ణా! నిశ్చయముగా నేనే తప్పులు చేసి దూషింపఁబడిన వాఁడను. నిన్ను వృథాగా నుపాలంభించుచున్నాను. ప్రియురాలి యెడఁబాటుచేఁ గలిగిన వేఁకిచే వేఁగుచున్న దుర్బుద్ధి చంద్రుని నిందించుట సహజమే కదా! 33

**శ్లో॥ కరుణాకర! దుర్దశాకులం**
**పతితాలమ్బన! పాపపఞ్జరమ్ ।**
**అమృతామ్బునిధే! మహాజ్వరం**
**నహి జహ్యా జగదీశ! జాతు మామ్ ॥ 34**

**ప్రతిపదార్థము :** కరుణా + ఆకర = దయకు గని వైన వాఁడా!; పతిత + ఆలంబన = పతితులకు (పాపులకు) చేయూఁత నిచ్చువాఁడా!; అమృత + అంబునిధే = అమృతమునకు సముద్రము వంటి వాఁడా! జగత్ + ఈశ = లోకముల కీశ్వరుఁడ వైన వాఁడా! శ్రీకృష్ణా!; దుర్దశా + ఆకులమ్ = చెడ్డ యవస్థచేఁ గలఁత చెందిన వానిని; పాపపంజరమ్ = పాపములకుఁ బంజరమైన వానిని; మహాజ్వరమ్ = గొప్ప తాపమునకు లోనైన వానిని, మామ్ = నన్ను; జాతు = ఎప్పుడు; నహి జహ్యాః = విడిచిపెట్టకుము.

**తాత్పర్యము :** దయానిధీ! పతితపావనా! సుధాసముద్రా! జగదీశ్వరా! శ్రీకృష్ణా! దుర్దశలోఁ జిక్కుకొని వ్యాకులత్వము నొందిన వానిని, పాపములకుఁ బంజరమైన వానిని, మహాతాపముచే నుడుకు వానిని నన్నెప్పుడును విడువకుము. 34

**శ్లో॥ కటుజల్పనమల్పకస్య మే**
**నహి తే కల్పయతు క్రుధం విభో! ।**
**కుపితాతురబాలభాషితం**
**కిము గృహ్ణన్తి? మనాఙ్మహాశయాః ॥ 35**

**ప్రతిపదార్థము :** విభో! = ప్రభూ! శ్రీకృష్ణా!; అల్పకస్య = మిక్కిలి యల్పుఁడ నైన; మే = నా యొక్క; కటు = చెవుల కింపు కాక కారము కల్గించు; జల్పనమ్ = నిరుపయోగ మైన మాట; తే = నీకు; క్రుధమ్ = కోపమును; న హి కల్పయతు = కల్పింపకుండుఁ గాక!; కుపిత = కోపించిన; ఆతుర = బాధపడుచున్న; బాల = చిన్నపిల్లవాని; భాషితమ్ = పలుకును; మహా + ఆశయాః = గొప్పయాశయము గల పెద్దవారు; మనాక్ = కొంచెము కూడ; కిము గృహ్ణంతి = గ్రహించుచున్నారా?

**తాత్పర్యము :** ప్రభూ! శ్రీకృష్ణా! మిక్కిలి యల్పుఁడ నైన నేను నీ చెవుల కింపు కాని యుపయోగము లేని మాటలను కటువుగాఁ బల్కుచున్నాను. కర్ణకఠోరములైన నా ప్రేలడములు నీకుఁ గినుకను గలిగింప కుండఁ గాక! కోపముతో బాధపడుచు నర్భకుఁడు పలికిన పలుకులను మహాశయులైన గొప్పవారు కొంచెము కూడ లెక్కపెట్టరు గదా! 35.

**శ్లో॥ భుజగాహితకల్పితధ్వజ!**
**స్ఫురదాశాభుజగాలివేల్లితమ్ ।**
**జటిలజ్వర కుఞ్జరాఙ్కుశ!**
**జ్వరజుష్టం న జహీహి జాతు మామ్ ॥ 36**

**ప్రతిపదార్థము :** భుజగ = పాములకు; అహిత = శత్రువైన; గరుత్మంతునిచే; కల్పిత = చేయఁబడిన; ధ్వజ = జెండా గలవాఁడా!, గరుత్మంతుఁడే పతాకగాఁ గలవాఁడా! శ్రీకృష్ణా!; స్ఫురత్ = ప్రకాశించుచున్న; ఎక్కువగా నున్న; ఆశా = ఆశ లనెడి; భుజగాలి = పాములచే; వేల్లితమ్ = చుట్టఁబడిన వానిని; జ్వర = తాపముచే; జుష్టమ్ = బాధపడుచున్న వానిని; జటిల = కష్టమైన; జ్వర = జ్వరమనెడి; కుంజర = ఏనుఁగునకు; అంకుశ! = అంకుశము వంటి వాఁడా!; మామ్ = నన్ను; జాతు = ఎప్పుడును; న జహీహి = విడిచిపెట్టకుము.

**తాత్పర్యము :** శ్రీకృష్ణా! నేను పెద్ద పెద్ద యాశలనెడి పాములచే జుట్టుకొనఁబడిన వాఁడను. నీవే పాములను సంహరించు గరుత్మంతుఁడే విజయధ్వజముగాఁ గల వాఁడవు. గరుడవాహనుఁడవు. నేను జ్వరము (దుఃఖము) చే బాధపడుచున్నవాఁడను. నీవో దట్టమైన జ్వరమనెడి యేనుఁగున కంకుశము వంటి వాఁడవు. కాఁబట్టి నా యాశాసర్పములను సంహరించి, నా దుఃఖతాపమును బోఁగొట్టి నన్నెప్పుడు విడిచి పెట్టక రక్షింపు మని భావము. 36

**శ్లో॥ న వదామి న దుష్కృతం మయా**
**కృతమిత్యుక్తిమిమాం తు మే శృణు ।**
**మమ భీతిమనీనశద్ విభో!**
**పతితోద్ధారకనామతావకమ్ ॥ 37**

**ప్రతిపదార్థము :** విభో! = ప్రభూ! శ్రీకృష్ణా!; దుష్కృతమ్ = పాపము; మయా = నా చేత; నకృతమ్ = చేయఁబడలేదు; ఇతి = అని; న వదామి = నేను చెప్పుట లేదు; మే = నా యొక్క; ఇమామ్ = ఈ; ఉక్తింతు = మాటనే; శృణు = వినుము; పతిత + ఉద్ + ద్ధారక = పతితులను బైకి లేపువాఁడను; తావకమ్ = నీ యొక్క; నామ = పేరే; మమ = నా యొక్క; భీతిమ్ = భయమును; అనీనశత్ = బాగుగా నాశనము చేసినది.

**తాత్పర్యము :** విభూ! శ్రీకృష్ణా! నేను పాపములు చేయలేదని నీతోఁ జెప్పుట లేదు. నా మాటను వినుము. పతితోద్ధారకుఁడను నీ నామమే నా పాతకముల నన్నింటిని బోఁగొట్టి నా భయమును నాశనము చేసినది. 37

**శ్లో॥ అపి శర్వపితామహాదిభి-**
**ర్భజనీయః పురుషోత్తమో హి యః ।**
**తముపాలభమానముద్ధతం**
**ధిగిమమ్ మాం ధిగిమాం ధియం మమ ॥ 38**

**ప్రతిపదార్థము :** యః = ఎవఁడు; శర్వ = శివుఁడు; పితామహా = బ్రహ్మ; ఆదిభిః = మొదలగు వారిచే; అపి = కూడ; భజనీయః = సేవింపఁదగిన వాఁడో; హి = నిశ్చయముగా; పురుష + ఉత్తమః = పురుషుల యందు శ్రేష్ఠుఁడో; తమ్ = అట్టి యా శ్రీకృష్ణుని; ఉపాలభమానమ్ = నిందించుచున్న వానిని; ఉద్ధతమ్ = గర్వించిన వానిని; ఇమమ్ = వీనిని (ఈ జగన్నాథకవిని); ధిక్ = తిరస్కరించుచున్నాను; మమ = నా యొక్క; ఇమామ్ = ఈ; ధియమ్ = బుద్ధిని; ధిక్ = నిందించుచున్నాను.

**తాత్పర్యము :** ఎవఁడు పంచముఖ – చతుర్ముఖాది దేవతలకు సేవనీయుఁడో నిశ్చయముగాఁ బురుషోత్తముఁడో యట్టి శ్రీకృష్ణుని గూడ దూషించు నీ గర్వితుని, ఈ జగన్నాథకవిని నన్ను నేనే తిరస్కరించుచున్నాను. నా బుద్ధిని నేనే నిందించుకొనుచున్నాను. 38

**శ్లో॥ అథ సర్వమిదమ్ మయోజ్ఝితం**
**భవతోఽ న్యన్నహి కిఞ్చిదర్థయే ।**
**మమ మానసగోచరీభవ-**
**త్వరవిన్దాక్ష! త వాద్భుతం వపుః ॥ 39**

**ప్రతిపదార్థము :** అరవిందాక్ష = పద్మముల వంటి కన్నులు గల శ్రీకృష్ణా!; అథ = ఇటు పిమ్మట; ఇదంసర్వమ్ = ఇది యంతయు; మయా = నా చేత; ఉజ్ఝితమ్ = విడిచిపెట్టఁ బడినది. భవతః = నీ దగ్గర నుండి; అన్యత్ కించిత్ = ఇతరమైన దానిని; నహి అర్థయే = నిశ్చయముగా నేను కోరను; తవ = నీ యొక్క; అద్భుతమ్ = ఆశ్చర్యకరమైన; వపుః =

శరీరము; మమ = నా యొక్క; మానస = మనస్సునందు; గోచరీభవతు = గోచరమగుఁ గాక!

**తాత్పర్యము :** పుండరీకాక్షా! శ్రీకృష్ణా! ఇంక నే నన్నింటిని విడిచిపెట్టుచున్నాను. నిన్ను మఱేమియుఁ గోరను. అద్భుతమైన నీ దివ్యమంగలవిగ్రహము నా మనస్సులోఁ బొడచూపుఁగాక! నీ సాక్షాత్కారము నాకుఁ గల్గుఁగాక! యని భావము.

**విశేషము :** 'గోచర + భవతు' అని యుండఁగా 'భవతు' అనునది భూధాతురూప మగుటచే – 'కృభ్వస్తియోగే సమ్పద్యకర్తరి చ్విః' (5–4–50) అను సూత్రముచే 'చ్వి' ప్రత్యయము వచ్చి; 'అస్య చ్వౌ' యను సూత్రముచే గోచరశబ్దము నందలి చివరి వర్ణమునకు 'ఈ' త్వము వచ్చి 'గోచరీభవతు' అను రూప మూర్పడును. 'అభూతతద్భావ ఇతి వాచ్యమ్ ।' అను వార్తికముచే నీ చ్విప్రత్యయమభూత తద్భావార్థము లో వచ్చును. అభూతతద్భావ మనఁగా నింతకు ముందు గానిది దాని భావమును బొందుట. ఇంతకు ముందు గోచరము గాని నీ విగ్రహమిపుడు నా మనస్సునకు గోచరించుఁగాక! యని భావము.

**అవతారిక :** ఇప్పుడా శ్రీకృష్ణపరమాత్మ యొక్క యద్భుతస్వరూపమగు దివ్యమంగల విగ్రహమును వర్ణించుచున్నాఁడు. 39

## కులకము

**శ్లో॥ హరినీలమయావనీతలే**
**వరబృన్దావిపినే విలాసిని ।**
**మణిమణ్డపమధ్యవిస్ఫుర-**
**ద్విబుధక్ష్మారుహమూలమాశ్రితమ్ ॥ 40**

**ప్రతిపదార్థము :** హరినీల = ఇంద్రనీల మణులచే; మయ = నిండిన; అవనీతలే = భూతలమునందు; విలాసిని = విలాసముల (గోపికాశృంగార క్రీడల) తోఁ గూడిన; వర = శ్రేష్ఠమైన; బృందావిపినే = బృందావనమునందు; మణి = రత్నములు పొదిగిన; మండప = వేదిక యొక్క; మధ్య = నడిమి భాగములో; విస్ఫురత్ = ఎక్కువగాఁ బ్రకాశించుచున్న; విబుధక్ష్మారుహ = కల్పవృక్షము యొక్క; మూలమ్ = మూల భాగమున (కాండము యొక్క మొదటి భాగమును); ఆశ్రితమ్ = ఆశ్రయించినది... ... ఈ శ్లోకముల కన్నింటికిఁ జివరి శ్లోకములోఁ గల **'హృదయాలంబనమస్తు'** అను క్రియతో నన్వయము. ఇట్టి శ్లోక సమూహమునకే 'కులక'మని పేరు.

**తాత్పర్యము :** ఇంద్రనీలరత్నములు పొదిగిన మహీతలమునందు గోపికాశృంగార

విలాసములతో నొప్పు శ్రేష్ఠమైన బృందావనములో మణులు చెక్కిన మండపము యొక్క మధ్యభాగములోఁ బ్రకాశించుచున్న కల్పతరువు యొక్క మూలము నాశ్రయించినది... ...

**విశేషము :** ఛన్దోబద్ధపదమ్ పద్యం తేన ముక్తేన ముక్తకమ్ ।
ద్వాభ్యాం తు యుగ్మకం సన్దానితకం త్రిభి రిష్యతే ॥
కలాపకం చతుర్భిశ్చ పఞ్చభిః కులకమ్ మతమ్ ॥ (సా.ద. 6-324)

ఛందోబద్ధములైన పదములకుఁ బద్యమని పేరు. ఏ పద్యమున కాపద్యమే విడివిడిగా నున్నచో నాపద్యములకు 'ముక్తకము' లని పేరు. రెండు శ్లోకములతో నున్న దానికి 'యుగ్మక' మని, మూఁడు శ్లోకములతోఁ గూడిన దానికి 'సందానితక' మని నాలుగు శ్లోకములు గలిగిన దానికి 'కలాపక' మని, యైదు శ్లోకములతో రచింపఁబడిన దానికి 'గులక' మని వ్యవహార మని శ్రీవిశ్వనాథకవిరాజు సాహిత్యదర్పణములోఁ జెప్పినాఁడు. ఐదు శ్లోకముల కంటె నెక్కువ శ్లోకము లున్నను గులకమే యగును. అందువల్లనే -

"పంచభిరితి న్యూనసంఖ్యావ్యవచ్ఛేదః। తేన మాఘాదౌ దశాదిభిః శ్లోకైః కులకం సంగచ్ఛతే" - 'పంచభిః' అని చెప్పుటచేఁ గులకములో నైదు కంటెఁ దక్కువ శ్లోకములుండఁగూడదు.

మాఘుని 'శిశుపాలవధము' మొదలగు వానిలోఁ బది శ్లోకములతోఁ గూడఁ గులకము గల దని సాహిత్యదర్పణవివృతిలో శ్రీరామచరణ తర్కవాగీశభట్టాచార్యులు చెప్పినారు.

ఈ విష్ణులహరి యందలి కులకములో 14 శ్లోకములు గలవు. 40.

**శ్లో॥ శిఖిపిఞ్ఛమహామణిస్ఫుర-
న్మకుటాకుఞ్చితకాన్తకున్తలమ్ ।
కమనీయతరాలకావలి-
భ్రమణభ్రాజిలలాటసున్దరమ్ ॥ 41**

**ప్రతిపదార్థము :** శిఖి = నెమిళ్ళ యొక్క; పిఞ్ఛ = పింఛములతో; మహామణి = గొప్ప గొప్ప నవరత్నములతో; స్ఫురత్ = ప్రకాశించుచున్న; మకుట = కిరీటమునందు; ఆకుంచిత = ముడిచిన; కాంత = అందమైన; కుంతలమ్ = జుట్టు గలది; కమనీయ = మిక్కిలి మనోహరము లైన; అలక = ముంగురుల యొక్క; ఆవలి = పంక్తి యొక్క; భ్రమణ = కదలికలచే; భ్రాజి = ప్రకాశించుచున్న; లలాట = నుదుటి భాగముచే; సుందరమ్ = అందమైనది... ...

**తాత్పర్యము :** నెమలి పింఛములతో గొప్ప రత్నములతోఁ బ్రకాశించుచున్న కిరీటమునందు దోఁపిన యందమైన శిరోజములు గలది; మిక్కిలి యింపైన ముంగురుల శ్రేణి యొక్క కదలికలచే విరాజిల్లుచున్న ఫాలభాగముచే నందమైనది ... ... ... 41

శ్లో॥ శరదిన్దుసహోదరాననం
దలదమ్భోజపలాశలోచనమ్ ।
అరుణాధరకాన్తిదన్తుర-
స఼్ుటదన్తాంశువికాసితామ్బరమ్ ॥ 42

**ప్రతిపదార్థము :** శరత్ = శరత్కాలము నందలి (ఆశ్వయుజ – కార్తికమాసము లందలి పున్నమి నాఁటి); ఇందు = చంద్రునకు; సహోదర = తమ్ముఁడైన (సమానమైన); ఆననమ్ = ముఖము గలది; దలత్ = విచ్చుచున్న; అంభోజ = పద్మము యొక్క; పలాశ = దళముల వంటి; లోచనమ్ = కన్నులు గలది; అరుణ = ఎఱ్ఱని; అధర = క్రింది పెదవి యొక్క; కాంతి = శోభతో; దంతుర = కొనలు దేఱి నిబిడముగా నున్న; స్ఫుట = స్పష్టమైన; దంత = రదములు (పలువరుస) యొక్క; అంశు = కిరణములచే; వికాసిత = వికసింపఁబడిన; అంబరమ్ = ఆకాశము గలది ... ...

**తాత్పర్యము :** శరదృతువు నందలి చంద్రునితో సమానమైన మోము గలది, వికసించుచున్న పద్మదళములతో సమానమైన కన్నులు గలది, ఎఱ్ఱని క్రింది పెదవి యొక్క కాంతితో మధ్య మధ్య నెడము లేక దట్టముగా సువ్యక్తముగా నున్న దంతముల కాంతిచేఁ బ్రకాశించుచున్న యాకాశము గలది (తెల్లని పలువరుస యొక్క కాంతి యాకసము వఱకుఁ బ్రసరించుచున్నదని భావము).... .... 42.

శ్లో॥ దరపాణ్డురగణ్డమణ్డల-
ప్రతిసర్పత్కమనీయకుణ్డలమ్ ।
మణిమౌక్తికమఞ్జుమఞ్జరీ-
మహనీయద్యుతిరఞ్జితశ్రుతి ॥ 43

**ప్రతిపదార్థము :** దర = కొంచెము; పాండుర = తెల్లగా నున్న; గండ = చెక్కిళ్ళ యొక్క; మండల = గుండ్రని భాగము నందు; ప్రతిసర్పత్ = గుండ్రముగాఁ దిరుగుచున్న; కమనీయ = మనోహరమైన; కుండలమ్ = కుండలములు గలది; మణి = మణులతో రత్నములతో; మౌక్తిక = ముత్యములతో; మంజు = అందమైన; మంజరీ = పూల గుత్తి యొక్క; మహనీయ = గొప్ప; ద్యుతి = కాంతిచే; రంజిత = రంజింపఁబడిన (ఎఱ్ఱని రంగుతోఁ గూడిన); శ్రుతి = చెవులు గలది.... ....

**తాత్పర్యము :** ఇంచుక తెల్లనైన గుండ్రని బుగ్గల చుట్టు తిరుగుచున్న యందమైన కుండలములు గలది, మణులతో ముత్యములతోఁ గూడిన మనోజ్ఞమైన పుష్పగుచ్ఛము యొక్క కాంతులచే రంజిల్లుచున్న చెవులు గలది .... .... 43.

శ్లో॥ పృథువర్తులమౌక్తికావలీ-
సుషమావేల్లితకాన్తకన్ధరమ్ ।
హరినీలగిరిద్యుతిద్రుహా
కమలామన్దిరవక్షసాఞ్చితమ్ ॥ 44

**ప్రతిపదార్థము :** పృథు = పెద్దవి యైన; వర్తుల = గుండ్రముగా నున్న; మౌక్తిక = ముత్యముల యొక్క; ఆవళీ = వరుస యొక్క; సుషమా = శోభచే; వేల్లిత = చుట్టఁబడిన; కాంత = అందమైన; కంధరమ్ = కంఠము గలది; హరినీల = ఇంద్రనీల మణులతో నిండిన; గిరి = పర్వతము యొక్క; ద్యుతి = కాంతికి; ద్రుహా = ద్రోహము తలపెట్టునది (ఇంద్రనీల పర్వత కాంతి కంటెను నల్లనైనదని భావము); కమలా = శ్రీలక్ష్మీదేవికి, మందిర = గృహమైన; వక్షసా = వక్షఃస్థలముచే; అంచితమ్ = ప్రకాశించునది... ...

**తాత్పర్యము :** పెద్దవి గుండ్రనివి యగు ముత్యముల పేటల కాంతిచేఁ జుట్టఁబడిన యొప్పిద మైన మెడ గలది, యింద్రనీల పర్వతకాంతిని మించి నల్లఁదనముతో నొప్పుచు లక్ష్మీదేవికి నివాసస్థాన మైన యురఃస్థలముచే విరాజిల్లునది... ... 44.

శ్లో॥ చరణాబ్జనఖావలమ్బినీం
భుజగాకారభుజాన్తరాగతామ్ ।
నిబిడాభ్రమివ క్షణప్రభాం
వహదుత్ఫుల్లవనామలస్రజమ్ ॥ 45

**ప్రతిపదార్థము :** చరణ + అబ్జ = పద్మముల వంటి పాదముల యొక్క; నఖ = గోళ్ళను; అవలంబినీమ్ = అవలంబించునది, శ్రీకృష్ణుఁడు కంఠములో ధరించిన వనమాల కాలి వ్రేళ్ళ గోళ్ళ వఱకు వ్రేలాడుచున్న దని భావము. భుజగ + ఆకార = పాము యొక్క యాకారముతో; భుజ + అంతర = శ్రీకృష్ణుని వక్షఃస్థలము పైకి; ఆగతామ్ = వచ్చినదియు; లేక పాముల వంటి భుజముల యొక్క మధ్య భాగములో నున్నదని చెప్పుకొనవచ్చును. మొదటి పక్షములో వనమాల పాము వలె నున్న దనియు, రెండవ పక్షములో శ్రీకృష్ణుని చేతులు పాముల వలె నున్న వనియు గ్రహింపవలెను. క్షణప్రభామ్ = మెఱుపుఁదీఁగను; వహత్ = వహించిన, ధరించిన; నిబిడ + అభ్రమ్ + ఇవ = దట్టమైన మబ్బు వలె; శ్రీకృష్ణుని మాల మెఱుపు వలె నున్న దనియు. శ్రీకృష్ణుని దేహము నల్లని మేఘము వలె నున్నదనియు భావము. ఉత్ఫుల్ల = బాగుగా వికసించిన; వన = వనము నందలి; అమల = నిర్మలమైన; స్రజమ్ = పూల యొక్క మాలను, వహత్ = ధరించేది అయిన (వైజయంతి యను వనమాల కంఠహారముగాఁ గలదని భావము) ... ...

**తాత్పర్యము :** ఈ శ్లోకములో శ్రీకృష్ణుని కంఠములో నున్న వైజయంతీమాల వర్ణింపఁబడినది. తమ్మిపూల వంటి యడుగుల యొక్క గోళ్ళ వఱకు వ్రేలాడుచున్నది, పాము వంటి యాకారముతో నున్నది, లేక పాముల వంటి శ్రీకృష్ణుని హస్తముల మధ్యభాగములో నున్నది, బాగుగా వికసించినవి నిర్మలములైనవి యగు వనపుష్పములు గలది, దట్టమైన నీల మేఘము వంటి శ్రీకృష్ణుని దేహముపై మెఱుఁగుఁదీఁగ వలె నొప్పునది యగు వనమాలను ధరించినది... ...

**విశేషము :** ఈ శ్లోకము నందలి చతుర్థపాదములో మొదట నున్న 'వహత్' అను దానికి బదులుగా 'బృహత్' అను పాఠాంతరము గలదు. అప్పుడు బృహత్ = పెద్దదైన పూలతోఁ గూడిన వనమాలను ధరించుచున్న దని యర్థము చెప్పుకొనవలయును. దధత్ = అను దానిని దరువాతి శ్లోకము నుండి యెరువు తెచ్చుకొనవలయును. అందువలన 'బృహత్' పాఠము కంటె 'వహత్' పాఠమే బాగున్నది. ఉస్మానియా విశ్వవిద్యాలయ ప్రతిలో 'వహత్' పాఠమే గలదు. 45

**శ్లో॥ మణికఙ్కణకాన్తిమాంసలం**
**దరఫుల్లామ్బుజసున్దరద్యుతి ।**
**పతితోద్ధరణే దృఢవ్రతం**
**కమనీయం కరయోర్యుగం దధత్ ॥ 46**

**ప్రతిపదార్థము :** మణి = మణులు పొదిగిన; కంకణ = (బంగారు) కడియముల యొక్క; కాంతి = కాంతిచే; మాంసలమ్ = బలిసినది (నిండినది); దర = కొంచెము; ఫుల్ల = వికసించిన; అంబుజ = పద్మముల యొక్క; సుందర = అందమైన; ద్యుతి = కాంతి గలది; పతిత = పాపులను; ఉద్ధరణే = పైకిలేపుటలో; దృఢ = గట్టి; వ్రతమ్ = నోము (నియమము) గలది; కమనీయమ్ = మనోహర మైన; కరయోః = చేతుల యొక్క; యుగమ్ = జంటను; దధత్ = ధరించుచున్నది... ...

**తాత్పర్యము :** ఈ శ్లోకములో శ్రీకృష్ణుని చేతులు వర్ణింపఁబడినవి. మణులతో నున్న కంకణముల కాంతితో నిండినది, యించుక వికసించిన పద్మములవలె సుందరమైన కాంతి గలది, పతితుల నుద్ధరించుటలో దృఢమైన వ్రతమును బూనినది, మనోజ్ఞమైనది యగు; ఇవి యన్నియుఁ గరయుగమునకు విశేషణములు. చేదోయిని ధరించినది... ... 46.

**శ్లో॥ వరరత్నమయాఙ్గులీయకా-**
**వలిశోభామిలితాంగులీగణైః ।**
**ముహురాకులితేన వేణునా**
**వశయత్ ప్రాణభృతాం మనఃశ్రుతీః ॥ 47**

**ప్రతిపదార్థము :** వర = శ్రేష్ఠమైన; రత్న = రత్నములతో; మయ = నిండిన; అంగుళీయక = ఉంగరముల; ఆవలి = వరుస యొక్క; శోభా = కాంతితో; మిలిత = కలిసిన; అంగులీ = వ్రేళ్ళ యొక్క; గణైః = గుంపులచే; ముహుః = మాటి మాటికి; ఆకులితేన = కదలింపఁ బడిన; వేణునా = పిల్లనఁగ్రోవిచే; ప్రాణభృతామ్ = ప్రాణుల యొక్క; మనఃశ్రుతీః = మనస్సులను, చెవులను; వశయత్ = వశము చేసి కొన్నది... ...

**తాత్పర్యము :** శ్రీకృష్ణుఁడు వేణువు నూఁదుచుఁ దన వ్రేళ్ళతోఁ గదలించు చున్నాఁడు. ఆ పదివ్రేళ్ళకు నుంగరము లున్నవి. ఆ యుంగరములన్నియు రత్నములు పొదిగినవి. అందువల్లనే కాంతుల నీనుచున్నవి. ఆ వేణుగానమునకు జనుల యొక్క (గోవు మొదలగు జంతువుల యొక్క; పాముల యొక్క - ఇవి యన్నియుఁ బ్రాణభృచ్ఛబ్దముచే గ్రహింపఁ దగినవి) మానసములు, శ్రవణములు వశమగుచున్నవని భావము. 47

**శ్లో॥ ఉదరద్యుతినిమ్నగోచ్చల-**
**ల్లహరీరూపకరోమరాజికమ్ ।**
**పశుపాలవిలాసినీలస-**
**న్నయనాకర్షణనాభినిమ్నితమ్ ॥ 48**

**ప్రతిపదార్థము :** ఉదర = బొజ్జ యందలి; ద్యుతి = కాంతి యను; నిమ్నగా = నది నుండి; ఉత్ + చలత్ = పైకి లేచుచున్న; లహరీ = కెరటముల యొక్క; రూపక = రూపము గల; రోమరాజికమ్ = నూఁగారు గలది; పశుపాలవిలాసినీ = గోపికాస్త్రీల యొక్క; లసత్ = ప్రకాశించుచున్న; నయన = కన్నులను; ఆకర్షణ = ఆకర్షించు; నాభి = బొడ్డుచే; నిమ్నితమ్ = లోఁతుగాఁ జేయఁబడినది.... ....

**తాత్పర్యము :** శ్రీకృష్ణుని పొట్టపై నున్న నూఁగారు బొజ్జ యొక్క కాంతి యను నది నుండి పైకి లేచిన కెరటముల రూపములో నున్నదనియు, శ్రీకృష్ణుని బొడ్డు గోపికాస్త్రీల నయనముల నాకర్షించుచున్న దనియు, ఆ బొడ్డు మిక్కిలి లోఁతుగా నున్నదనియు భావము.

**విశేషము :** బొడ్డు లోఁతుగా నుండుట లక్ష్మీప్రదము.

*కం॥ ఉరమును శిరమును ఫాలము*
*వరుసను విస్తృతము లైన వసుధను ఘనుఁ డం*
*దురు; నాభి లోఁతు నగు న*
*ప్పురుషుఁడు లక్ష్మీసమృద్ధిఁ బొల్పెసలారున్. (సా.శా-1-5)*

అని యన్నయమంత్రి సాముద్రికశాస్త్రము.

ఈ శ్లోకమునందలి మొదటిపాదము చివర నిర్ణయసాగరప్రతిలో, నుస్మానియా విశ్వవిద్యాలయప్రతిలోఁ దదనుసారి మధుసూదనశాస్త్రి ప్రతిలో– 'ఉచ్ఛలత్' అను పాఠముగలదు. ఇది సరియైనది గాదు. బూర్గుల వారి ప్రతిలో – 'ఉచ్చలత్' అను పాఠమే గలదు. 48

**శ్లో॥ కనకద్రవగౌరమమ్బరం**
**దధతోరుద్వితయేన సున్దరమ్ ।**
**ఉదయన్మణినూపురప్రభా–**
**సరణిశ్రేణిజటాలజానుకమ్ ॥ 49**

**ప్రతిపదార్థము :** కనకద్రవ = కరఁగించిన బంగారు నీరు వలె; గౌరమ్ = ఎఱుపును మించిన పసుపు వర్ణము గల; అంబరమ్ = బట్టను; దధతా = ధరించుచున్న; ఊరుద్వితయేన = తొడల జంటచే; సుందరమ్ = అందమైనది; ఉదయత్ = ఉదయించుచున్న; ఇది ప్రభకు విశేషణము. మణి = మణులు పొదిగిన; నూపుర = అందెల యొక్క; ప్రభా = కాంతి యొక్క; సరణి = మార్గము యొక్క; శ్రేణి = పంక్తిచే (నొప్పిదమై); జటాల = జడలు కట్టినట్లు దట్టమైన (బాగుగా బలిసిన); జానుకమ్ = మోఁకాళ్ళు గలది ... ...

**తాత్పర్యము :** బంగారు నీరుపూసిన విధముగాఁ బచ్చని రంగుగల పట్టుపుట్టము ధరించిన యూరుయుగ్మముచే నందమైనది, మణులు పొదిగిన యందెల నుండి పుట్టిన కాంతిపథము యొక్క పంక్తిచే నొప్పిదమై బలసిన మోఁకాళ్ళు గలది... ...

**విశేషము :** ఉదయన్మణి – 'అయ–గతౌ' యను ధాతు వాత్మనేపది యగుటచే 'లటఃశతృశానచా'... (3–2–124) అను సూత్రముచే 'శానచ్' ప్రత్యయము ముమాగమము వచ్చి 'ఉదయమాన' యని యగును. అనుదాత్తేత్వమగు నాత్మనేపద మనిత్య మగుటచేతను; ఇట 'కిట కటీ గతౌ' అనుచోటఁ గొంద ఱీకారప్రశ్లేషము నంగీకరిచుట వలనను – ఉత్పూర్వక ఈ ధాతువునకు శతృప్రత్యయము చేరి 'ఉదయత్' అను రూప మేర్పడును. 'ఉదయతి వితతోర్ధ్వరశ్మిరజ్జౌ' (శిశు–4–20); అని మాఘమహాకవియు, 'ఉదయతి కలమన్దైః కంఠతాలై రలీనామ్' (అనర్ఘ –7–71) అని మురారి మహాకవియుఁ బ్రయోగించినారు.

ఈ శ్లోకమునందుఁ బదప్రయోగము సరిగా లేదు. స్థితస్య గతిశ్చింతనీయా' యను న్యాయముచే శబ్దముల కర్థము నెట్లో కిట్టించి భావమును సరిపెట్టు కొనవలసి వచ్చుచున్నది. 49

**శ్లో॥ అరిగీర్ణగజేన్ద్రగోపనే**
**దధతా జాంఘికతామలౌకికీమ్ ।**

**త్రిజగన్మహనీయమూర్తినా**
**వరజంఘాయుగలేన శోభితమ్ ॥** **50**

**ప్రతిపదార్థము :** అరి = శత్రువైన మొసలిచే; గీర్ణ = మ్రింగఁబడిన; గజేంద్ర = గజేంద్రుని యొక్క; గోపనే = రక్షణమునందు; అలౌకికీమ్ = లోకాతీతమైన; జాంఘికతామ్ = పరుగెత్తుట యందలి వేగమును; దధతా = ధరించుచున్న – ఇది జంఘాయుగళమునకు విశేషణము. త్రిజగత్ = ముల్లోకములందు; మహనీయ = గొప్పదైన; మూర్తినా = రూపము గలదగు; వర = శ్రేష్ఠమైన; జంఘా = పిక్కల యొక్క; యుగలేన = జంటచే; శోభితమ్ = ప్రకాశించుచున్నది.... ....

**తాత్పర్యము :** శత్రువైన మొసలికిఁ జిక్కిన గజేంద్రుని రక్షించుటకై యలౌకికమైన వేగమును ధరించినది, ముజ్జగములందు మహనీయమైన రూపము గలదియు నగు పిక్కల జంటచే శోభితమైనది .... .... 50.

**శ్లో॥ కులిశాఙ్కుశకమ్బుసామ్బుజ-**
**ధ్వజచక్రాద్యభిరామలక్ష్మణా ।**
**అరుణారుణకోమలత్విషా**
**కమనీయేన కలేన రాజితమ్ ॥** **51**

**ప్రతిపదార్థము :** కులిశ = వజ్రము; అంకుశ = అంకుశము (ఏనుఁగును ద్రోలు నినుపకోల); కంబు = శంఖము; స + అంబుజ = పద్మముతోఁ గూడిన; ధ్వజ = పతాకము (జెండా); చక్ర = చక్రము; ఆది = మొదలైన; అభిరామ = ఒప్పిదమైన; లక్ష్మణా = రేఖాచిహ్నముల చేతను; అరుణ + అరుణ = మిక్కిలి యెఱ్ఱనైన; కోమల = మృదువైన; త్విషా = కాంతిచే; కమనీయేన = మనోహరమైన; కలేన = పాదమూలంతో; రాజితమ్ = ప్రకాశించినది... ...

**తాత్పర్యము :** వజ్రాది రేఖలచే నెఱ్ఱని కాంతులచే మనోహరమైన యఱకాలిచేఁ బ్రకాశించినది ... ... ఇవి యన్నియు భగవత్పాదమునకు విశేషణములు.

విశేషము : అఱకాలి యందు వజ్రాదిశుభరేఖలు గలవారు చక్రవర్తులు, సార్వభౌములు నగుదు రని సాముద్రికశాస్త్రము.

*కం॥ హల కులిశ కలశ తోమర*
*జలచర జలజాత శంఖ చక్ర చ్ఛత్రో*
*జ్జ్వలలాంఛనకరపదములు*
*గల యాతఁడు ధరణి నేలుఁ గడు నొప్పారున్.* (సా.శా. 1–66.)

అని యాంధ్ర సాముద్రికశాస్త్రములో నన్నయమంత్రి చెప్పినాఁడు.

**శ్లో॥ విధిశర్వముఖామరస్ఫుర-**
**న్మకుటోన్నిద్రమణిప్రభాకులమ్ ।**
**నఖచన్ద్రమయూఖమూర్ఛితా-**
**ఖిలతాపం పదయోర్యుగం దధత్ ॥ 52**

**ప్రతిపదార్థము :** విధి = బ్రహ్మదేవుఁడు; శర్వ = శివుఁడు; ముఖ = ముందుగా నున్న (మొదలైన); అమర = దేవతల యొక్క; స్ఫురత్ = ప్రకాశించు చున్న; మకుట = కిరీటములందు; ఉన్నిద్ర = పైకిలేచిన; మణి = మణుల యొక్క; ప్రభా = కాంతులచే; ఆకులమ్ = నిండినది; నఖ = గోళ్ళనెడి; చంద్ర = చంద్రుని యొక్క; మయూఖ = కిరణములచే; మూర్ఛిత = మూర్ఛిల్లఁజేసిన (పోఁగొట్టఁబడిన); అఖిల = సమస్త; తాప = సంతాపములు గలదియగు; పదయోః = అడుగుల యొక్క; యుగమ్ = జంటను; దధత్ = ధరించునది... ...

**తాత్పర్యము :** బ్రహ్మ, శివుఁడు మొదలగు దేవతలందఱును వంగి నమస్కరించుచుండఁగా వారి మకుటములలోఁ బ్రకాశించు కాంతులచే నిండుగా శోభిల్లుచున్నది, కాలి గోళ్ళనెడు చంద్రరేఖల నుండి ప్రసరించుచున్న కిరణములచే ననఁగా వెన్నెలచే భక్తుల సకల సంతాపములను బోఁగొట్టునదియు నగు నడుగుదోయిని ధరించినది... ... 52.

**శ్లో॥ సరతః సరణౌ సతో బహిః**
**స్వపతో వాలపతో గృహాన్తరే ।**
**వపురీదృశమీశ! తావకం**
**హృదయాలమ్బనమస్తు మే సదా ॥ 53**

**ప్రతిపదార్థము :** ఈశ = ఈశ్వరా! శ్రీకృష్ణా!; సరణౌ = మార్గము నందు; సరతః = నడుచునప్పుడు; బహిః = బయట; సతః = ఉన్నప్పుడు; గృహ + అన్తరే = ఇంటి లోపల; స్వపతః = నిద్రించునప్పుడు; ఆలపతః వా = మాటలాడుతూ ఉన్నపుడు; ఈదృశమ్ = ఇటువంటి; తావకమ్ = నీ యొక్క; వపుః = దేహము (స్వరూపము); మే = నా యొక్క; హృదయ = డెందమునకు; ఆలంబనమ్ = ఊఁతగా; సదా= ఎల్లప్పుడూ; అస్తు = ఉండుఁగాక!

**తాత్పర్యము :** ఈశ్వరా! శ్రీకృష్ణా! వీధి మార్గములో సంచరించునప్పుడు, బయట నిలుచు నప్పుడు, నింటిలో నిద్రించు నప్పుడు, నితరులతో నాలాపములు చేయు నప్పుడు నెల్లప్పుడు నిటు వంటి నీ దివ్యమంగళ విగ్రహము నా హృదయమున కవలంబనముగా నండగా నుండుఁగాక!

**విశేషము :** పోతన గారి భాగవతములోఁ బ్రహ్లాదుని స్థితి యిట్లే వర్ణింపఁబడినది-

*శా॥ పానీయంబులు ద్రావుచున్ గుడుచుచున్ భాషించుచున్ హాసలీ*
*లోనిద్రాదులు సేయుచున్ దిరుగుచున్ లక్షించుచున్ సంతత*
*శ్రీనారాయణ పాదపద్మయుగళీచింతామృతాస్వాదసం*
*ధానుండై మఱచెన్ సురారిసుతుఁ డేతద్విశ్వమున్ భూవరా! (భాగ-7-123)*

ఆత్మనివేదనముచేయుచు నీవిష్ణు లహరీస్తోత్రమును రచించుచున్న శ్రీజగన్నాథమహాకవికిఁ గూడ నిట్టి సమాధిస్థితియే సిద్ధించినదని గ్రహింపవలెను.

హరినీలమయావనీతలే (40) అను శ్లోకము మొదలుకొని 'పదయో ర్యుగం దధత్' (52) అను శ్లోకము దాఁక నిప్పటి వఱకుఁ జెప్పిన విశేషణము లన్నియు 'వపురీదృశ మీశ' యను నీ శ్లోకములోఁ గల శ్రీకృష్ణుని శరీరమున కన్వయించును.

ఈ శ్లోకముతోఁ గులకము పూర్తియైనది. 53

**శ్లో॥ నవనీరదనీలిమద్యుతి-**
**ర్నమనీయో నిగమైర్నిరన్తరమ్ ।**
**నిరయే నిపతన్తమాశు మాం**
**నయనేనాపి సనాథయేద్విభుః ॥ 54**

**ప్రతిపదార్థము :** నవ = క్రొత్తగాఁ బట్టిన; నీరద = మేఘముల యొక్క; నీలిమ = నల్లని; ద్యుతిః = కాంతి గలవాఁడు; నిగమైః = వేదములచే; నిరంతరమ్ = ఎడతెగకుండా; నమనీయః = వంగి నమస్కరింపఁ దగినవాఁడు; విభుః = ప్రభువైన శ్రీకృష్ణుఁడు; నిరయే = నరకమునందు; నిపతంతమ్ = పడుచున్న; మామ్ = నన్ను; ఆశు = వేగముగా; నయనేన + అపి = కంటితో నైనను; సనాథయేత్ = సనాథునిగాఁ జేయుఁగాక!

**తాత్పర్యము :** నవీననీలమేఘశ్యాముఁడు, వేదములచే నెల్లప్పుడు నమస్కరింపఁదగిన వాఁడు, నా విభుఁడు నైన శ్రీకృష్ణపరమాత్మ నరకలోకములోఁ గూలిపడుచున్న నన్ను వేగముగా వచ్చి కంటి చూపుతో నైనను సనాథునిగాఁ జేయుఁగాక! ఇంత వఱకు ననాథునిగా నున్న నన్నుఁ గటాక్షించి సనాథునిగాఁజేయుఁగాక! యని భావము. 54

**విశేషము :** భారవి కిరాతార్జునీయమును శ్రీ శ్రీహర్షుఁడు నైషధ మహాకావ్యమును వంశస్థ వృత్తములతో మొదటి సర్గమును మొదలుపెట్టి ద్వితీయసర్గమును వియోగినీ వృత్తములతో రచించినారు. అట్లే శ్రీజగన్నాథ మహాకవి గూడ నీ కరుణాలహరిని 1-12 శ్లోకముల వఱకు వంశస్థ వృత్తములతో రచించి, 13-54 శ్లోకముల వఱకు వియోగినీ వృత్తములను రచించినాఁడు.

'సర్గై రనతి విస్తీర్ణైః శ్రావ్యవృత్తైః సుగన్ధిభిః'

అను దండ్యాచార్యుని వచనము ననుసరించి యిది సర్గబంధమైన మహాకావ్యము కాక పోయినను నీలఘుస్తోత్రకావ్యమును బాఠకులకు శ్రోతలకు శ్రుతిరంజనమునకై శ్రావ్యవృత్తములతో ముగించుచున్నాఁడు.

**శ్లో॥ ప్రణిపత్య హరే! భవన్తమద్ధా**
**వినిబద్ధాఞ్జలిరేక మేవ యాచే ।**
**జనురస్తు కులే కృషీవలానా-**
**మపి గోవిన్దపదారవిన్దభాజామ్ ॥ 55**

**ప్రతిపదార్థము :** హరే = శ్రీకృష్ణా!; వినిబద్ధ + అంజలిః = సంఘటించిన దోసిలి కలవాఁడనై; ప్రణిపత్య = నమస్కరించి; అద్ధా = సత్యముగా; ఏకమ్ + ఏవ = ఈ యొక్క దానినే; యాచే = ప్రార్థించుచున్నాను; (మమ = నా యొక్క); జనుః = జన్మము; గోవింద = శ్రీకృష్ణుని యొక్క; పద + అరవింద = పద్మముల వంటి పదములకు; భాజామ్ = భాక్కులైన (సేవకులైన); కృషీవలానామ్ = కర్షకులయొక్క; కులే అపి = వంశమునందైనను; అస్తు = అగుఁగాక!

**తాత్పర్యము :** హరీ! శ్రీకృష్ణా! చేతులు జోడించి యంజలి బంధించి నమస్కరించి యథార్థముగా నిన్నీ యొక్క విషయమునే యాచించుచున్నాను. గోవిందపాదారవిందారాధనము గావించు కృషీవలుల వంశమునందైనను నాకుఁ బుట్టుక కలుఁగుఁగాక! భక్తి లేని ధనవంతుల యున్నత వంశములోఁ బుట్టుట కంటె భగవద్భక్తితో భూమి దున్నుకొనుచుఁ బొట్ట పోషించుకొను నిమ్న వంశములోఁ బుట్టుట మంచిదని భావము.

**విశేషము :** ఉస్మానియా విశ్వవిద్యాలయ ప్రతియందు, దాని ననుసరించిన శ్రీమధుసూదన శాస్త్రి ప్రతియందు నీ శ్లోకము నందలి నాల్గవ పాదములోఁ జివర 'భాజామ్' అను పాఠము గలదు. రసగంగాధరములోఁ గూడ నీ పాఠమే గలదు. నిర్ణయసాగరము వారి కావ్యమాలా ప్రతియందు బూర్గుల వారి ప్రతియందు 'భాజామ్' అను దానికి బదులుగా 'భావః' అను పాఠము గలదు. 'నేను కృషీవలుల యింటఁ బుట్టవలయును, నాకు గోవిందపదారవింద భావము కావలయు' నను దానిలో స్వారస్యము లేదు. కవికిఁ గావసినది భగవద్భక్తి గాని, కృషీవల జన్మము గాదు. కేవలము ధనార్థులగు కృషీవలుల యింట జన్మించినచో భగవద్భక్తి లభింపదు. భగవద్భక్తులగు కృషీవలుల యింటఁ బుట్టినప్పుడే భగవద్భక్తి లభించును. భక్తి లేని ధనవంతుల యింటఁ బుట్టుట కంటె, భక్తి గల కృషీవలుల యింటఁ బుట్టుట మంచిదని కవి భావము. 'భాజామ్' అను పాఠమును స్వీకరించినపుడది కృషీవలులకు విశేషణమై

కవ్యభిప్రేత భావము సిద్ధించును. కాఁబట్టి 'భావః' అను పాఠము కంటె 'భాజామ్' అను పాఠమే మేలైనది.

ఇది విమలా – బధిరా వృత్తములతోఁ గూడిన యర్ధసమవృత్తము. ఈ శ్లోకములో 1–3 పాదములందు 'విమలా' వృత్తము. 'విమలా ససజం గురూ యదా స్యాత్' (వాగ్వ–348) విమలా వృత్తములో 'స–స–జ–గగ' యను గణము లుండునని దుఃఖభంజనకవి వాగ్వల్లభములోఁ జెప్పినాఁడు. 2–4 పాదములలో 'బధిరా' వృత్తము. 'బధిరా స్యాత్ సభరా యదా యకారః' (వాగ్వ–692) బధిరా వృత్తములో 'స–భ–ర–య' యను గణము లుండునని వాగ్వల్లభము. ఈ యర్ధసమవృత్తమునకే 'మాలభారిణి' యని పేరు.

**విషమే ససజా గురూ సమేచేత్**
**సభరా యేన తు మాలభారి ణీయమ్ ।** (చం. మ. –12)

అని గంగాదాసుని ఛందోమంజరీలక్షణము.

జగన్నాథమహాకవి యీ స్తోత్రాంతములో నీపద్యమును నిబంధించుటలో రహస్యమే మన – శ్రీకృష్ణా! నేను 'విమల'మైన చిత్తవృత్తితో నిన్ను వేఁడుకొనుచున్నాను. అయినను నీవు 'బధిరు'ని (చెవిటి వాని) వలెఁ బెడచెవినిఁ బెట్టుచున్నా' వని ఛందోధ్వనిని సూచించుట కని తెలియవలయును.

ఈ శ్లోకము రసగంగాధరములో ననుజ్ఞాప్రకరణములో నుదాహరింపఁబడినది.

ఉత్కటగుణవిశేషలాలసయా దోషత్వేన ప్రసిద్ధ స్యాపి వస్తునః ప్రార్థన మనుజ్ఞా। యథా – 'ప్రణిపత్య విధే ... ... భాజామ్' అత్ర హరిభక్తిలాలసయా కృషీవలకులజన్మనః ప్రార్థనమ్.

ఉత్కట (గొప్పదైన) మైన గుణవిశేషమునందలి లాలస (అధికేచ్ఛ) చే దోషముగాఁ బ్రసిద్ధమైన వస్తువును బ్రార్థించుట యనుజ్ఞ. ఈ శ్లోకములో నుత్కటమైన హరిభక్తిలాలసతోఁ గృషీవల కుల జన్మమును గోరుట వలన ననుజ్ఞాలంకారము. 55.

**శ్లో॥ సురస్రోతస్విన్యాః పులినమధితిష్ఠన్నయనయో–**
**ర్విధాయాన్తర్ముద్రామథ సపది విద్రావ్య విషయాన్ ।**
**విధూతాన్తర్ధ్వాన్తో మధురమధురాయాం చితి కదా**
**నిమగ్నః స్యాం కస్యాంచన నవనభస్యామ్బుదరుచి ॥ 56**

**ప్రతిపదార్థము :** సురస్రోతస్విన్యాః = దేవనది యైన గంగ యొక్క; పులినమ్ = ఇసుక తిన్నెను; అధితిష్ఠన్ = అధిష్ఠించి; నయనయోః = కన్నులయందు; అంతర్ముద్రామ్ =

లోముద్రను – యోగముద్రను; విధాయ = కూర్చి – ధరించి; అథ = ఆ తరువాత; సపది = శీఘ్రముగా, విషయాన్ = బాహ్య విషయములను; విద్రావ్య = ద్రవింపఁజేసి – నీరుచేసి (విడిచిపెట్టి) విధూత = పాఱఁద్రోలిన; అంతః = మనస్సులోపలి; ధ్వాంతమ్ = చీఁకటి గలవాఁడనై; మధురమధురాయామ్ = మిక్కిలి తీపి యైన; కస్యాంచన = ఒకానొక; నవ = క్రొత్త; నభస్య = భాద్రపద మాసము నందలి; అంబుద = మేఘముల; రుచి = కాంతి గల; చితి = చైతన్యము (పరమాత్మ) నందు; కదా = ఎప్పుడు; నిమగ్నః స్యామ్ = మునుఁగుదునో కదా!

**తాత్పర్యము :** గంగానదీ తీరము నందలి యిసుకతిప్పలో సమాధిస్థితిలోఁ గూర్చుండి, బాహ్యవిషయముల నన్నింటిని దూరముగా నెట్టి, కనుల మూసికొని యోగముద్రను ధరించి మనస్సులో నున్న యజ్ఞానమనెడి చీఁకటిని బాఱఁద్రోలిన వాఁడనై భాద్రపద మాసములో వచ్చిన నల్లని మేఘము వంటి కాంతి గలిగిన యొకానొక మిక్కిలి తియ్యనైన బ్రహ్మము (శ్రీకృష్ణపరమాత్మ) నందు నెప్పుడు మునిఁగి పోవుదునో కదా!

**విశేషము :** వస్తుతస్తు వక్ష్యమాణ శ్రుతిస్వారస్యేన రత్యాద్యవచ్ఛిన్నా భగ్నావరణా చిదేవ రసః – **'రసో వై సః'** అను శ్రుతి వచన స్వారస్యముచే భగ్నావరణమైన (అజ్ఞాన మనెడి యావరణము తొలఁగఁడిన) చిత్తే రసమని జగన్నాథుని రసగంగాధర సిద్ధాంతము. ఆ చిదానంద రస సముద్రములో మునుఁగ వలెనని మహాకవి యాకాంక్ష.

ఇది శిఖరిణీవృత్తము. 'రసై రుద్రై శ్ఛిన్నా యమనసభలా గః శిఖరిణీ' (వృ.ర. 3–93) – శిఖరిణీ వృత్తములోఁ బ్రతిపాదము నందు – 'య–మ–న–స–భ–లగ' గణము లుండునని కేదారభట్ట వృత్తరత్నాకర లక్షణము.

"ఇదమ్ పద్యమ్ మన్నిర్మితాయామ్ భగవద్భక్తి ప్రధానాయాం కరుణాలహర్యా ముపనిబద్ధమితి తత్ప్రధానభావ ప్రాధాన్య మేవార్హతి" అని రసగంగాధరములో నీపద్యము తాను నిర్మించిన కరుణాలహరి లోనిదని జగన్నాథమహాకవి స్పష్టముగాఁ జెప్పినాఁడు. ఉస్మానియా విశ్వవిద్యాలయము వారు ప్రకటించిన పండితరాజకావ్యసంగ్రాహము నత్యంత శ్రద్ధతోఁ బరిష్కరించిన యార్యేంద్రశర్మ గారి కన్ను గప్పి యీ పద్య మాగ్రంథములో నెక్కడను లేక త్రుటితమగుట చిత్రముగా నున్నది. ఈ సంస్కరణము ననుసరించి కరుణాలహరికి బాలక్రీడానువాదమును రచించిన శ్రీమధుసూదన శాస్త్రిగారు కూడ నీ శ్లోకమును విడిచిపెట్టుట యింత కంటెను విచిత్రముగా నున్నది. 56.

**అవతారిక :** ఇట మీఁద నాలుగు శ్లోకములు భామినీ విలాసములో నున్నవి కరుణాలహరిలోఁ బ్రక్షిప్తములు గలవు. వీని నార్యేంద్రశర్మగారు గ్రహింపలేదు. శ్రీమధుసూదనశాస్త్రిగా

రనువదింప లేదు. అయినను నీ నాలుగు శ్లోకములు నిర్ణయసాగరము వారి కావ్యమాలా ప్రతిలో నుండుట చేతను, శ్రీ బూర్గుల రామకృష్ణరావు మహోదయులు తెనిఁగించుట వల్లను ప్రక్షిప్తము లైనను పాఠకుల సౌకర్యార్థ మిక్కడఁ గూడ వ్యాఖ్యానింపఁబడుచున్నవి.

**శ్లో॥ వాచా నిర్మలయా సుధామధురయా యాం నాథ! శిక్షామదా-**
**స్త్వాం స్వప్నేఽపి న సంస్మరామ్యహమహంభావావృతో నిస్త్రపః ।**
**ఇత్యాగశ్శతశాలినమ్ పునరపి స్వీయేషు మాం బిభ్రత-**
**స్త్వత్తో నాస్తి దయానిధిర్యదుపతే! మత్తో న మత్తః పరః ॥ 57**

**ప్రతిపదార్థము :** నాథ! = ప్రియా! జగన్నాథా!; యదుపతే = యాదవప్రభూ! శ్రీకృష్ణా!; సుధామధురయా = అమృతము వలెఁ దియ్యనైన; నిర్మలయా = మలినము లేని; వాచా = వాక్కుతో; యామ్ = ఏ; శిక్షామ్ = శిక్షణమును; అదాః = ఇచ్చితివో; (అట్టి వాక్కుతో) త్వామ్ = నిన్ను; నిస్త్రపః = సిగ్గు లేని వాఁడనై; అహంభావ + ఆవృతః = అహంకారముచే నావరింపఁబడిన వాఁడనై; అహమ్ = నేను; స్వప్నే + అపి = కలలోఁ గూడ; న సంస్మరామి = సంస్మరించుటలేదు. ఇతి = ఈ విధముగా; ఆగః + శత + శాలినమ్ = నూఱుల కొలఁది యపరాధములు చేసిన; మామ్ + అపి = నన్నుఁ గూడ; పునః = మఱల; స్వీయేషు = నీ భక్తులలో; బిభ్రతః = భరించుచున్న; త్వత్తః = నీ కంటె; దయానిధిః = కరుణానిధి; నాస్తి = లేఁడు; మత్తః = నా కంటె; మత్తః + అపి = మదించిన వాఁడు కూడ; పరః = అన్యుఁడు; నాస్తి = లేఁడు.

**తాత్పర్యము :** నాథా! యదుపతీ! అమృతము వలెఁ దియ్యనైన నిర్మలమైన వాక్కులతో నీవు నన్ను శిక్షించితివి. అట్టి వాక్కును శిక్షగా నేనభ్యసించితిని. నీవు శిక్షగా నేవాక్కుతోఁ జదివించితివో యా వాక్కుతో సిగ్గు లేని నేను నహంభావముతో నిన్ను స్వప్నములోఁగూడ స్మరించుట లేదు. ఇట్లు వందల కొలఁది యపరాధములు చేసిన నన్నుఁ గూడ మఱల నీ భక్తకోటిలోఁ జేర్చుకొని సాకుచున్నావన్నచో నీ కంటె మఱియొక కృపానిధియు లేఁడు. నా కంటె మత్తుఁడు కూడ వేఱొకఁడు లేఁడు.

**విశేషము :** 'మత్తః పరః' అనుచోట 'మత్తోఽ పరః' యని యార్యేంద్రశర్మగారి పాఠము. 'అపరుఁడు = అన్యుఁడు' వేఱొకఁడు లేఁడని యదియే యర్థము.

'త్వత్తః – మత్తః = త్వత్ + తః – మత్ + తః అను శబ్దములు 'పంచమ్యా స్తసిల్' (5–3–7) అను సూత్రముచే విధింపఁబడిన పంచమీవిభక్త్యర్థములో వచ్చిన 'తసిల్' ప్రత్యయాంతములు.

ఈ శ్లోకము రసగంగాధరములోఁ బ్రసాదగుణమున కుదాహరణముగాఁ జూపఁబడినది.

"యథా వా – 'వాచా నిర్మలయా...' అత్ర గుణాంతరాసమానాధికరణః ప్రసాదః" – ఈ శ్లోకములో నన్యగుణములతో సంకీర్ణము గాని కేవలప్రసాదగుణమే గలదని భావము.

"శ్రుతమాత్రా వాక్యార్థం కరతలబదర మివ నివేదయన్తీ ఘటనా ప్రసాదస్య' – వినిన వెంటనే వాక్యార్థము నఱచేతి లోని రేఁగుపండు వలెఁ దోఁపించు పదరచనకుఁ బ్రసాద మని పేరు. ఇక్కడ – 'మత్తః పరః' అను పాఠమే గలదు. 57.

**శ్లో॥ పాతాలం వ్రజ! యాహి! వా సురపురీమారోహ! మేరోః శిరః**
**పారావారపరమ్పరాం తర! తథాప్యాశా న శాన్తా తవ ।**
**ఆధివ్యాధిజరాపరాహత! యది క్షేమం నిజం వాఞ్ఛసి**
**శ్రీకృష్ణేతి రసాయనం రసయ రే! శూన్యైః కిమన్యైః శ్రమైః ॥ 58**

**ప్రతిపదార్థము :** పాతాలమ్ = పాతాళలోకమునకు; వ్రజ = వెళ్ళుము; వా = లేక; సురపురీమ్ = దేవపట్టణమైన స్వర్గలోకమునకు; యాహి = వెళ్ళుము; మేరోః = బంగారు పర్వతము యొక్క; శిరః = తలపైకి (శిఖరముపై); ఆరోహ = ఎక్కుము; పారావార = సముద్రముల యొక్క; పరంపరామ్ = వరుసను; తర = దాఁటుము; తథాపి = అట్లయినను గూడ; తవ = నీ యొక్క; ఆశా = ఆశ; న శాంతా = శాంతింపదు – తగ్గదు; ఆధి = మనో వేదనలచే, వ్యాధి = శరీర రోగములచే; జరా = ముసలితనముచే; పరాహత = దూరముగాఁ గొట్టఁబడిన వాఁడా (బాధపడువాఁడా!) నిజమ్ = నీ యొక్క; క్షేమమ్ = కుశలమును; వాంఛసి = కోరుచున్న వాఁడ వైనచో; శ్రీకృష్ణ + ఇతి = శ్రీకృష్ణా! యను; రసాయనమ్ = మందును; రే = ఓరీ! రసయ = రుచి చూడుము – త్రాగుము; శూన్యైః = రిత్తయైన; అన్యైః = తక్కినవగు; శ్రమైః = శ్రమములతో; కిమ్ = ఏమి పని?

**తాత్పర్యము :** పాతాళమునకు వెళ్ళుము. లేక స్వర్గలోకమున కేఁగుము. మేరుపర్వత శిఖరముపై నెక్కి కూర్చుండుము. సముద్రముల నన్నింటిని దాఁటుము. అయినను నీ యాశ శాంతింపదు. మనోవేదనలతో, రోగములతో, ముసలితనముతో బాధపడుచున్న వాఁడా! నీ క్షేమమును నీవు నిజముగాఁ గోరుకొన్నచో నోరీ! 'శ్రీకృష్ణా' యను భగవన్నామాక్షర రసాయనమును బానము చేయుము. శూన్యములైన తక్కిన పనులతో నీకేమి పని గలదు?

**విశేషము :** ఆర్యేంద్రశర్మ గారి సంస్కరణములో నిక్కడ ద్వితీయ పాదములో–

**'పారావారపరమ్పరా స్తర! తథాప్యాశా న శాన్తా స్తవ'**

అని బహువచనపాఠములు గలవు. అప్పుడు – పారావార పరంపరాః = సముద్రముల వరుసలను; తర = దాఁటుము; తథాపి = అయినను గూడ; తవ = నీ యొక్క; ఆశాః = ఆశలు; న శాంతాః = శాంతింపవు – అని యర్థము చెప్పుకొనవలెను. మనస్సునఁ బుట్టు రోగమునకు 'ఆధి' యని పేరు. శరీరమునఁ బుట్టు రోగమునకు 'వ్యాధి' యని పేరు, 'బంధకం వ్యసనం చేతః పీడాధిష్ఠాన మాధయః' 'రోగ వ్యాధి గదామయాః' యని యుభయత్ర యమరము. జరావ్యాధులను బోఁగొట్టెడి యౌషధము రసాయనము. మనోవ్యాధికి మందులేదు. భగవన్నామ స్మరణ మొక్కటి మాత్రమే దివ్యౌషధము.

**శ్లో॥ వజ్రం పాపమహీభృతాం భవగదోద్రేకస్య దివ్యౌషధం**
**మిథ్యాజ్ఞాననిశావిశాలతమసస్తిగ్మాంశుబిమ్బోదయః ।**
**క్రూరక్లేశమహీరుహాముఋతరజ్వాలాజటాలశ్శిఖీ**
**ద్వారం నిర్వృతి సద్మనో విజయతే కృష్ణేతి వర్ణద్వయమ్ ॥ 59**

**ప్రతిపదార్థము :** కృష్ణ + ఇతి = కృష్ణా! యను; వర్ణద్వయమ్ = అక్షరముల జంట; పాప = పాపము లనెడి; మహీభృతామ్ = పర్వతములకు; వజ్రమ్ = వజ్రాయుధము; భవ = పుట్టుక – చావులతోఁ గూడిన సంసార మనెడి; గద = రోగముల యొక్క; ఉద్రేకస్య = విజృంభణమునకు; దివ్య + ఔషధమ్ = దివియందుఁ బుట్టిన మందు; మిథ్యా = అసత్యమైన; జ్ఞాన = జ్ఞానమనెడి; నిశా = రాత్రి యందలి; విశాల = విరివియైన; తమసః = చీఁకటికి; తిగ్మ + అంశు + బింబ + ఉదయః = సూర్యబింబము యొక్క యుదయము; క్రూర = కఠిన మైన; క్లేశ = దుఃఖము లనెడి; మహీరుహామ్ = చెట్లకు; ఉరుతర = మిక్కిలి పెద్దదైన; జ్వాలా = మంటలతో; జటాలః = జడలు వేసిన; శిఖీ = అగ్ని; నిర్వృతి = ఆనంద మనెడి; సద్మనః = గృహమునకు; ద్వారమ్ = గుమ్మమునై; విజయతే = సర్వోత్కృష్టముగా వర్తిల్లుచున్నది.

**తాత్పర్యము :** కృష్ణా! యను నక్షరముల జంట పాపపర్వతములకు వజ్రాయుధము. పర్వతముల ఱెక్కల నింద్రుని వజ్రాయుధ మెట్లు వ్రక్కలు చేయునో యట్లే శ్రీకృష్ణనామము పాపములను బటాపంచలు చేయును. సంసారబంధము లనెడి జబ్బుల యుబ్బునకు దివ్యౌషధము. మందు రోగముల నెట్లు నయము చేయునో శ్రీకృష్ణనామ మట్లు భవబంధముల నూడ్చివేయును. భగవంతుఁడొక్కఁడే నిత్యమైన వాఁడు, తక్కిన జగత్తంతయు ననిత్యమైనది యనునది సత్యమైన జ్ఞానము. భగవంతుఁడు లేఁడు. జగత్తే యున్నదను జ్ఞానము మిథ్యాజ్ఞానము. ఇదియే యజ్ఞానము. అజ్ఞానమనెడి రాత్రి యందలి కటిక చీఁకటికి సూర్యోదయము. సూర్యుఁడుదయించినంతనే చీఁకటులెట్లు తొలఁగునో యట్లే శ్రీకృష్ణనామముచ్చరించి నంతనే మిథ్యాజ్ఞానము నశించును. కరడు కట్టిన కష్టములను

వృక్షములకు మంట లనెడి జడలతోఁ బైకి లేచిన యగ్ని. అగ్ని వృక్షములనెట్లు తగులఁబెట్టునో యట్లే శ్రీకృష్ణనామము క్లేశములను నిశ్శేషముగా బూడిద చేయును. ఆనంద మనెడి యింటికి ద్వారము. ఆనందమనఁగా బ్రహ్మప్రాప్తి. అదియే ముక్తి. గుమ్మమింటి లోనికిఁ బ్రవేశించుట కెట్లు మార్గము నిచ్చునో యట్లే శ్రీకృష్ణనామము మోక్షప్రాప్తికి దారి నొసఁగునని భావము.

**విశేషము :** ఈ మూఁడు శ్లోకములు శార్దూలవిక్రీడితములు.

**'సూర్యాశ్వై ర్మసజస్తతాః సగురవః శార్దూలవిక్రీడితమ్'**

అని వృత్తరత్నాకరలక్షణము. శార్దూలవిక్రీడితములోఁ బ్రతిపాదమునందు 'మ - స - జ - స - త - త - గ' యను గణములుండును. 59.

**శ్లో॥ విశాలవిషయాటవీవలయలగ్నదావానల-**
**ప్రసృత్వరశిఖావలీవికలితం మదీయం మనః ।**
**అమన్దమిళదిన్దిరే నిఖిలమాధురీమన్దిరే**
**ముకున్దముఖచన్దిరే చిరమిదం చకోరాయతామ్ ॥ 60**

**ప్రతిపదార్థము :** విశాల = విరివిగా నున్న; విషయ = సంసార విషయము లనెడి; అటవీ = అడవి యొక్క; వలయ = వలయము (వర్తులాకారముగానున్నచుట్ట) నందు; లగ్న = తగులుకొన్న; దావ + అనల = దావాగ్ని యొక్క; ప్రసృత్వర = ప్రసరించుచున్న; శిఖా + ఆవలీ = మంటల వరుసచే; వికలితమ్ = వికలముగాఁ జేయఁబడిన; మదీయమ్ = నా యొక్క; మనః = మనస్సు; అమంద = ఎక్కువగా; మిలత్ = కలియుచున్న; ఇందిరే = లక్ష్మీదేవి గలది; నిఖిల = సమస్తము లైన; మాధురీ = తియ్యఁదనములకు; మందిరే = గృహమైనది యగు; ముకుంద = శ్రీకృష్ణుని యొక్క; ముఖ = ముఖ మనెడి; చందిరే = చంద్రునియందు; చకోరయతామ్ = చకోర పక్షివలె నగుఁగాక!

**తాత్పర్యము :** ఒకదాని వెంబడి యొకటిగా విరివిగాఁ బుట్టు సంసార విషయములు (శబ్ద - స్పర్శ - రూప - రస - గంధము లనెడి యింద్రియ విషయములు) అనెడి యరణ్యచక్రము నందుఁ దగులుకొని రగులుకొన్న దావాగ్ని యొక్క ప్రసారముచేఁ బుట్టిన మంటల సుడిగుండముచే వికలత్వము చెందిన (కలఁతపడిన) నా మనస్సు లక్ష్మీదేవితో నెక్కువగాఁ గూడచున్నది, సమస్తమాధుర్యములకు నిలయమైనది యగు శ్రీకృష్ణుని ముఖమను చంద్రుని యందుఁ జకోరపక్షిగా నగుఁగాక!

అడవిలోని మంటలకు భయపడిన చకోరపక్షి చంద్రునెట్లాశ్రయించునో యట్లే సంసారవిషయవాసనలలోఁ జిక్కుకొని భీతి పొందు నా మనస్సు శ్రీకృష్ణముఖచంద్రు నాశ్రయించుఁగాక! యని భావము.

**విశేషము :** ఈ శ్లోకము పృథ్వీవృత్తము

**'జసౌ జసయలా వసుగ్రహయతి శ్చ పృథ్వీ గురుః'**

అని వృత్తరత్నాకరలక్షణము. పృథ్వీవృత్తములోఁ బ్రతిపాదము నందు 'జ - స - జ - స - య - ల - గ' అను గణములుండును. ఈ శ్లోకమునందలి 3-4 పాదములలో 'ఇందిరే - మందిరే - చందిరే' యనుచోట నంత్యానుప్రాసము.

ఈ నాలుగు శ్లోకములు నార్యేంద్రశర్మగారు సంస్కరించిన పండితరాజకావ్య సంగ్రహము నందలి భామినీవిలాసములోని శాంతవిలాసమునందు విశకలితములుగాఁ గలవు. 60.

ఫలశ్రుతి

**శ్లో॥ ఇమాం వై విష్ణులహరీం జగన్నాథేన నిర్మితామ్ ।**
**యః పఠే త్తస్య సర్వత్ర జాయన్తే జయసమ్పదః ॥ 61**

**ప్రతిపదార్థము :** జగన్నాథేన = జగన్నాథకవిచే; నిర్మితామ్ = రచింపఁబడిన; ఇమామ్ = ఈ; విష్ణులహరీమ్ = విష్ణులహరిని; యః = ఎవఁడు; పఠేత్ = చదువునో; తస్య = వానికి; సర్వత్ర = అన్ని చోట్ల; జయ = జయము; సంపదః = సంపదలు; జాయంతే = పుట్టుచున్నవి.

**తాత్పర్యము :** శ్రీ పండితరాజ జగన్నాథమహాకవిచే నిర్మింపఁబడిన యీ విష్ణులహరి నెవఁడు పఠించునో వాని కన్ని తావులందును జయము సంపదలు లభించునని భావము.

**ఇతి పణ్డితరాజశ్రీజగన్నాథవిరచితా కరుణాలహరీ సమాప్తా ॥**

ఇది పండితరాజ శ్రీజగన్నాథవిరచితమగు కరుణాలహరీ స్తోత్రము సమాప్తము.

**తే॥గీ॥ పుష్పగిరి శంకరాచార్య పూజ్యపాద**
**దత్తవిద్యావిభూషణోద్దండబిరుద**
**శాలి శ్రీశర్మ శ్రీకరుణాలహరికి**
**నమృతధారాఖ్యటీక నాంధ్రమునఁజెప్పె.**

**గద్యము :** ఇది శ్రీమత్పరమేశ్వర కరుణాకటాక్షలబ్ధకవితా విచిత్ర పరాశరగోత్ర పవిత్ర శ్రీగరిమెళ్ళకృష్ణావధాని పౌత్ర శ్రీసూర్యకాంతాంబికా సూర్యనారాయణపుత్ర సకల సుకవిబుధజనవిధేయ సహజపాండిత్య – అచ్యుత సత్య శేషగిరి సోమయాజి శర్మ నామధేయ ప్రణీతంబైన యమృతధార యను శ్రీవిష్ణులహరీటీక సర్వము సమాప్తము.

**శ్రీమత్పరమేశ్వరార్పణమస్తు**

**శ్రీ శ్రీ శ్రీ**